# తెలుగు భారతి

## మూడవ తరగతి వాచకం

ప్రధాన సంపాదక మండలి :

అధ్యక్షులు : ఆచార్య కె.కె. రంగనాధాచార్యులు

ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి

చిత్రాలు :

స్టూడియో ప్రొఫైల్

న్యూ ఢిల్లీ



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

హైదరాబాదు

First Published 1998
New Impressions 1998, 1999, 2000, 2001 & 2002.



This book has been printed on
80 GSM White Creamwove Paper and
200 GSM White Pulp Board (MG/MF)

**Price Rs. 12.00**

*Printed in India*
at
Poovu Printers 5-2-15H, Sattur Road,
Post Bag No. 23, Sivakasi 626123.
*For The Director, A.P. Govt. Text Book Press,*
*Mint Compound, HYDERABAD 500 004*
*ANDHRA PRADESH*

## ముందుమాట

**2002** సం. నాటికి **6-11** సం. పిల్లలందరికి విద్యను అందించాలనే మహత్తర ఆశయంతో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం (డి.పి.ఇ.పి.) మనరాష్ట్రంలో కొనసాగుతోంది. పిల్లలకు గుణాత్మక విద్యను అందించడం ద్వారా వారి స్థాయిని పెంచడమనేది డి.పి.ఇ.పి. లక్ష్యాలలో చాలా ముఖ్యమైనది. దీనిలో భాగంగా ఈ వాచక రూపకల్పన జరిగింది.

భాష భావ వ్యక్తీకరణకు, భావ గ్రహణకు తోడ్పడే సాధనం. పిల్లలు స్వేచ్ఛగా తమ భావాలను, ఆలోచనలను, అనుభూతులను, అనుభవాలను ఇతరులకు అర్థమయ్యే రీతిలో స్పష్టంగా, దోషరహితంగా చెప్పగలగాలి. అట్లాగే ఎదుటి వారు తెలియపరిచే విషయాలను సరియైన రీతిలో అవగాహన చేసుకోగలగాలి. పిల్లలు ఆసక్తితో, తమకోసం తాము అభ్యసన ప్రక్రియలలో పాల్గొనడం ద్వారా మాత్రమే మనం కోరుకునే స్థాయిని సాధించగలం.

పిల్లలు పాఠ్యపుస్తకాన్ని తమకిష్టమైనదిగా భావించి, ఉపయోగించాలి. వారిలో పఠనాశక్తిని పెంపొందించడానికి ఆసక్తి కల్గించే చిత్రాలతో, సులభమైన పదాలతో, ఆటలు, పాటలు, కథలు మొదలయిన వాటిని పాఠ్యాంశాలుగా ఈ వాచకంలో పొందు పరచడం జరిగింది.

పాఠాల కింద ఇచ్చిన అంశాలు పిల్లలను ఆలోచింపచేసేవిగా, ఆసక్తి కల్గించేవిగా ఉండి తమ ఊహలను, అనుభూతులను స్వేచ్ఛగా తెలియపరచడానికి వీలుగా ఉన్నాయి. శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాలతో పాటు కల్పనా శక్తిని, సృజనాత్మకతను పెంపొందించటానికి వీలుగా తయారు చేయడం జరిగింది.

ఎంత మంచి పాఠ్యపుస్తకమైనా ఉపాధ్యాయునికి దీటురాదు. ఉపాధ్యాయుడు పిల్లలు తమంతట తాముగా నేర్చుకోడానికి సహజవాతావరణాన్ని కల్పించి మంచి ఫలితాలు పొందవచ్చును.

పిల్లలకిష్టమైన రీతిలో వాచకాన్ని రూపొందించడానికి జరిగిన ఈ ప్రయత్నాన్ని ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, విద్యాభిమానులు సాదరంగా స్వీకరిస్తారని ఆశిస్తూ, తగిన సలహాలు సూచనలు అందజేయగలరని కోరుతున్నాం.

## వాచకాన్ని రూపొందించినవారు

### ఉపాధ్యాయులు

| | | |
|---|---|---|
| శ్రీమతి బి. సుజాతాశేఖర్ | - | కేంద్ర ప్రాథమిక పాఠశాల, దేవరకొండ, నల్గొండజిల్లా |
| శ్రీ డి.వీరంగాచార్యులు (రిటైర్డ్) | - | ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూల్, స్వర్ణ, ప్రకాశం జిల్లా |
| శ్రీ ముదిగొండ శాస్త్రి | - | ఎస్.ఎఫ్. ప్రాథమికోన్నత పాఠశాల, ఎలకుర్రు, కృష్ణాజిల్లా |
| శ్రీ టి. కుమారస్వామి చెట్టి | - | ఖాజీ మున్సిపల్ స్కూల్, చిత్తూరు |
| శ్రీమతి ఎ. సత్యగీత | - | ప్రా.పా. నర్సింగవానిపాలెం, వడ్లపూడి, విశాఖపట్నం జిల్లా |
| శ్రీ యం. తిరుపతయ్య | - | యం.పి. యు.పి. స్కూల్, అచ్చంపేట, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీ బి. సూర్యనారాయణ | - | ఎలిమెంటరీ స్కూల్, పినగడి, విశాఖపట్నం జిల్లా |
| శ్రీమతి సి. పద్మలత | - | సెంట్రల్ యు.పి.స్కూల్, బాలానగర్, రంగారెడ్డి జిల్లా |

### ప్రశిక్షకులు

| | | |
|---|---|---|
| డా. డి. చంద్రశేఖర రెడ్డి | - | రీడరు, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, హైద్రాబాదు |
| డా. బి. సరోజన | - | ఉపన్యాసకులు, ఉన్నత విద్యా అధ్యయన సంస్థ హైద్రాబాదు |
| శ్రీమతి ఏ. రత్నమాల | - | ఉపన్యాసకులు, ఆంధ్రమహిళా సభ, విద్యాకళాశాల, హైద్రాబాదు |
| శ్రీమతి బి. శశి | - | ఉపన్యాసకులు రాష్ట్ర విద్యా పరిశోధనా శిక్షణా సంస్థ, హైద్రాబాద్ |
| శ్రీ ఎస్.బి.జె.ఆర్. చౌదరి | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ బోయపాలెం, గుంటూరు జిల్లా |
| శ్రీ యస్. గోపాలకృష్ణమూర్తి | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ భీమునిపట్నం, విశాఖపట్నం జిల్లా |
| శ్రీ బి. నీలకంఠరావు | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ సబ్‌క్యాంపస్ ఉట్నూర్, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ కె. మహదేవరెడ్డి | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ, నిజామాబాద్ |
| శ్రీ యం.జె. పురుషోత్తంనాయుడు | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ కార్వేటినగరం, చిత్తూరు జిల్లా |
| డా. ఎ. కొమరయ్య | - | ఉపన్యాసకులు, జిల్లా విద్యాశిక్షణా సంస్థ, వరంగల్ జిల్లా |
| శ్రీ కె. రామమూర్తి | - | అకడమిక్ మానిటరింగ్ ఆఫీసర్ & స్టేట్ రిసోర్సు గ్రూపు సభ్యులు, డి.పి.ఇ.పి., నెల్లూర్ జిల్లా |
| శ్రీ సువర్ణ వినాయక్ | - | మండల రిసోర్స్ పర్సన్, మంథని & స్టేట్ రిసోర్సు గ్రూపు సభ్యులు, డి.పి.ఇ.పి., కరీంనగర్ జిల్లా |
| శ్రీ ఖండేరావు రమేశ్‌రావు | - | మండల రిసోర్స్ పర్సన్ కరీంనగర్ & స్టేట్ రిసోర్సు గ్రూపు సభ్యులు, డి.పి.ఇ.పి., కరీంనగర్ జిల్లా |



### ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం - అభ్యసన సూత్రాలు

అ. ఉపాధ్యాయులు రూపొందించిన అభ్యసన ప్రక్రియలను కల్పించటం.

ఆ. క్రియలు, అన్వేషణ, ప్రయోగాల ద్వారా అభ్యసనాన్ని అభివృద్ధి పరచటం.

ఇ. వ్యక్తిగత, జట్టు, పూర్తి తరగతి పనిని అభివృద్ధి పరచటం.

ఈ. వైయక్తిక భేదాలకు తగిన అభ్యసనాన్ని కల్పించటం.

ఉ. స్థానిక పరిసరాలను వినియోగించటం.

ఊ. విద్యార్థుల పనిని ప్రదర్శించి, చక్కగా నిర్వహించటం ద్వారా ఆసక్తికరమైన తరగతిగదిని రూపొందించటం.

# వందే మాతరం

- బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం వందేమాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరం

భావం : భారతమాతకు వందనం, తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైరుతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

ఉపాధ్యాయులకు సూచన :

స్వాతంత్ర్య సమరంలో వందేమాతరం గీతం యావద్భారత దేశాన్నీ ఉర్రూతలూగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సింహగర్జనలా మారుమోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ రాసిన "ఆనంద్ మఠ్" నవలలోనిది. ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పాలి.

## మా తెలుగు తల్లి

- శంకరంబాడి సుందరాచారి



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం - నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ ! జై తెలుగు తల్లీ !



## సారే జహాఁసె అచ్ఛా

- మహ్మద్ ఇఖ్బాల్

సారే జహాఁసె అచ్ఛా హిందుస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్‌కే, యే గుల్ సితా హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బాఁ హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్‌హై జిన్ కే దమ్‌సే రష్ కే జినాఁ హమారా ॥

మజ్-హబ్ నహీఁసిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁహమ్ వతన్ హైఁ హిందుస్తాఁ హమారా ॥

భావం : ప్రపంచంలోకెల్లా మన భారతదేశం ఉత్తమమైంది ఇది మనకో ఉద్యానవనం. మనమిక్కడ బుల్ బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలచి ఉంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీ జలాలలో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయ పడుతున్నది. మతం, పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన :

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.

## జాతీయ గీతం

- రవీంద్రనాథ్ టాగూరు

జనగణమన అధినాయక జయహే !
భారత భాగ్య విధాతా !
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ !
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయ గాథా !
జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్యవిధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

భావం : జనులందరి మనస్సులకూ అధినేతవు. భారత భాగ్య విధాతవు అయిన నీకు జయమగుగాక. పంజాబు, సింధు, గుజరాత్, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్యహిమాలయ పర్వతాలతోను, యమునా గంగా ప్రవాహాలతోను ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్య విధాతా ! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకూ మంగళ ప్రదాతవు, భారత భాగ్య విధాతవు, అయిన నీకు జయమగుగాక ! జయమగుగాక ! జయమగుగాక !

ఒక వివరణ : ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. మరాఠా అంటే మహారాష్ట్రం. ద్రావిడ అంటే తెలుగు, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలు. ఉత్కళ అంటే ఒరిస్సా, వంగ అంటే ఇప్పటి పశ్చిమ బెంగాలు.



## ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు. నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వసంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్నీ గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

# జన్మభూమి ప్రతిజ్ఞ

నేను జన్మభూమి సమగ్ర అభివృద్ధి
మహోద్యమంలో
పాల్గొని, నిస్వార్థంతో, నీతి
నిజాయితీలతో, పట్టుదలతో,
నిరంతరకృషితో, అందరి
సహకారంతో, నవ సమాజ నిర్మాణం
కోసం నా వంతు బాధ్యతను
నిర్వహిస్తానని జన్మభూమి
సాక్షిగా ప్రతిజ్ఞ చేస్తున్నాను.
జై జన్మభూమి
జై జై జన్మభూమి

జైహింద్ జై జన్మభూమి



# విషయసూచిక

# 1. బుడుగులం !!

పిడుగులం !
మేం బుడుగులం !!

నింగికి నేలకు నిచ్చెనలం !
విశ్వప్రేమకు వారసులం !!

బంకమట్టితో బండ్లను చేస్తాం !
ఇసుకతోనె మేం కోటలు కడతాం !!

రావి ఆకులతొ బూరలు చేస్తాం !
కొబ్బరాకులతొ రాకెట్లేస్తాం !!

వానొస్తే మేం గంతులు వేస్తాం !
కత్తిపడవలే సొంపుగ చేస్తాం !!

ఆటలు పాటలు కథలను చెపితే !
మానకుండ మేం బడికీ పోతాం !!

పిడుగులం !
మేం బుడుగులం !!

## ఇవి చేయండి

అ. రాయండి, చదవండి :

1) ఈ పాట ఎవరి గురించి చెప్తుంది ?
2) నీకు ఏఏ ఆటలంటె ఇష్టం ?
3) ఇసుకలో నువ్వు ఏ ఆటలు ఆడుకుంటావు ?
4) వాన కురుస్తూంటె నువ్వు ఏమి చేస్తావు ?
5) బడిలో నువ్వు ఏమిచేస్తావు ?

ఆ. కింది వాటిని సరయిన పదాలతో కలిపి రాయండి :

| | |
|---|---|
| లడ్డూలు | పాడతాం |
| బొమ్మలు | ఆడతాం |
| కథలు | తింటాం |
| ఆటలు | వింటాం |
| పాటలు | గీస్తాం |

ఉదా : లడ్డూలు తింటాం

__________
__________
__________
__________



ఇ. ఇలాంటి పదాలు మరికొన్ని రాయండి :

| | | | | |
|---|---|---|---|---|
| ఆట | పాలు | గురువు | బడి | పోతాం |
| పాట | కాలు | బరువు | గుడి | చేస్తాం |
| ___ | ___ | ___ | ___ | ___ |
| ___ | ___ | ___ | ___ | ___ |
| ___ | ___ | ___ | ___ | ___ |
| ___ | ___ | ___ | ___ | ___ |
| ___ | ___ | ___ | ___ | ___ |
| ___ | ___ | ___ | ___ | ___ |



ఈ. ఈ బస్సు బొమ్మలో ఏవేవి ఉండాలో రాయండి :



__________
__________
__________
__________
__________
__________

ఉ. కింది పదాలను జాగ్రత్తగా చూడండి. ప్రతి పదం చివరి అక్షరంతో మొదలయ్యే మరొకపదం ఉంది. వాటిని ఆ క్రమంలో కలుపుతూ వెళ్లండి :



| | | | |
|---|---|---|---|
| కమల | గద | గునపం | దవడ |
| బుడగ | పురుగు | తలుపు | కడవ |
| దిండు | పండగ | లత | వదనం |
| డమడమ | డుంబు | మరక | నంది |

ఊ. పాటను అభినయిస్తూ పాడండి :



# 2. పల్లె



అది ఒక పల్లె. ఆ పల్లె పేరు రామాపురం. ఆ పల్లెచుట్టూ పచ్చని పొలాలున్నాయి. పొలాలను ఆనుకుని ఎత్తైన కొండలున్నాయి. కొండలపైకి వెళ్ళేదారులు వంకరటింకరగా ఉన్నాయి. పిల్లలు అప్పుడప్పుడు కొండలపైకి ఎక్కుతూ ఉంటారు. కొండలపై నుంచి కిందికి చూసినప్పుడు పెద్ద పెద్ద ఇళ్ళు కూడా చిన్నవిగా కనబడతాయి.

రామాపురంలో ఎక్కువ మంది వ్యవసాయం చేస్తారు. పొద్దుటి నుంచి సాయంత్రం వరకూ పొలాలలో పనులు చేస్తు ఉంటారు. పనులు చేసేటప్పుడు పాటలు పాడుతూంటారు. పండించిన పంటను, కూరగాయలను పట్టణానికి తీసుకుని పోయి అమ్ముతారు. కొందరు పాలూ, గుడ్లూ కూడా అమ్ముతారు.

ఆ పల్లెలో బడి ఉంది. ఆ బళ్ళో ఐదు తరగతులున్నాయి. ఆ బడికి పాఠశాల విద్యా కమిటీ ఉంది. ఆ కమిటీ బడి బాగోగులను చూస్తుంది. పిల్లలు బడి చుట్టూ పూల చెట్లు పెంచుతుంటారు. బడిలో పిల్లలు ఆటలు ఆడుతుంటారు. పాటలు పాడుతు ఉంటారు.

ఆ పల్లెలో పోస్టాఫీసు ఉంది. మహిళామండలి ఉంది. రాత్రిబడి కూడా ఉంది. గ్రామ పంచాయితీవారు అప్పుడప్పుడు గ్రామసభలు జరుపుతారు. ఆ సభలలో ఊరికి అవసరమయిన వాటిపై చర్చిస్తారు. ఆ పల్లెలోని వారందరూ కలసిమెలసి ఉంటారు.



## ఇవి చేయండి

**అ. జవాబులు చెప్పండి, రాయండి :**

1. పల్లె చిత్రంలో ఏమేమి ఉన్నాయి?
2. రామాపురంలో ఏ ఏ రకాల ఇళ్ళు ఉన్నాయి?
3. పాఠంలో 'పల్లె' అనే పదం ఎక్కడెక్కడ ఉందో దాని కింద గీత గీయండి.
4. మీ పాఠశాల విద్యాకమిటీ అధ్యక్షుడు, సభ్యులు ఎవరు? (తెలుసుకొని రాయండి)
5. మీ ఊరిలో ఏయే జంతువుల పాలు దొరుకుతాయి?
6. మీ ఊరిలో ఏయే జంతువులను వ్యవసాయం చేసేందుకు ఉపయోగిస్తారు?
7. మీ ఊరిలో కాసే కూరగాయలను ఎక్కడ అమ్ముతారు?
8. పాఠంలో ఈ కింది ఒత్తులు ఉన్న పదాలను రాయండి?

్ల ్ర ్వ ్య ్త

**ఆ. జట్లలో రాయండి.**

1. మీ ఊరిలో కాసే కూరగాయలు, పండే పంటల పేర్లు రాయండి.
2. కొండపై నుండి చూస్తే ఇళ్ళు ఎలా కనిపిస్తాయి? ఎందుచేత?
3. 'రామాపురం'లో ఉన్నవాటిని చదివి, అవి మీ ఊరిలో ఉంటే '✓' పెట్టండి. లేకుంటే 'x' పెట్టండి.

| రామాపురం | మా ఊరు |
|---|---|
| డాబా ఇళ్ళు | |
| పెంకుటిళ్ళు | |
| గుడిసెలు (పూరిళ్ళు) | |
| వ్యవసాయం చేస్తారు | |
| పాలు, పెరుగు అమ్ముతారు | |
| బడి / రాత్రిబడి | |
| పాఠశాల విద్యాకమిటీ | |
| పోస్టాఫీసు | |
| మహిళామండలి | |
| గ్రామపంచాయితీ | |
| గ్రామసభలు జరుగుతాయి | |
| కలసిమెలసి ఉంటారు | |



4. 'రామాపురం'లో లేనివి, మీ ఊళ్ళో ఉన్నవి ఏవి?

**ఇ. కింది పదాలతో ఖాళీలను నింపండి**

(పోస్టాఫీసు, కలసిమెలసి, గ్రామసభ, చర్చించారు)

ఒక గ్రామంలో రాము, సోము అనే మిత్రులు ఉండేవారు. వాళ్లు ఎప్పుడూ ____________ ఉండేవారు. వాళ్ళ ఊళ్లో అప్పుడప్పుడు ____________ జరుగుతుంది. రాము సోము ఆ సభకు వెళ్లారు. ఆ సభలో వారందరు తమ అవసరాలను గురించి ____________. రాము, సోము తమ గ్రామ సభ గురించి మిత్రులకు ఉత్తరాలు రాద్దామనుకొన్నారు. కార్డులకోసం వారు ____________కు వెళ్లారు.

**ఈ. బొమ్మలు గీయండి రంగులు నింపండి.**



- రోడ్డు పై కారు బొమ్మ గీయండి.
- రోడ్డు పక్కన ఇల్లు బొమ్మ గీయండి.
- గుడికి పసుపు రంగు వేయండి.
- సూర్యుడికి ఎరుపు రంగు వేయండి.
- పోస్టాఫీసుకు నీలి రంగు వేయండి.
- చెట్టుకు ఆకుపచ్చ రంగు వేయండి.
- బడి దగ్గరి జెండాకు మూడురంగులు వేయండి.

# 3. పందెం

చిత్రాలను చూసి కథ చెప్పండి.



















## 4. పరమానందయ్య శిష్యులు

పరమానందయ్యగారికి పన్నెండు మంది శిష్యులు. వాళ్లు ఒకరోజు కట్టెలకోసం అడవికి వెళ్ళారు. తిరుగు ప్రయాణంలో వాళ్లు ఒక వాగును దాట వలసి వచ్చింది.

"అమ్మో! వాగులో మునిగి పోతామేమో" అంటూ భయపడ్డారు. "మనం ఒకరి చేయి ఒకరం పట్టుకొని వాగు దాటుదాం" అన్నాడు ఒకడు. "సరే" అన్నాడు మరొకడు. అలాగే వారు వాగును దాటారు. శిష్యుల్లో ఒకరికి "అందరం వాగుదాటామా?" అనే అనుమానం వచ్చింది. "ఒరేయ్! మీరంతా వరుసలో నిలబడండి. నేను లెక్కపెడతాను" అన్నాడు. అందరూ వరుసలో నిలబడ్డారు.

"ఒకటి, రెండు, మూడు ........ పదకొండు. ఒరేయ్ పదకొండు మందిమే ఉన్నాం! ఒకడు వాగులో మునిగిపోయాడు" అన్నాడు. శిష్యులందరూ ఒకరి తరువాత ఒకరు లెక్కబెట్టారు. ఎన్నిసార్లు లెక్కబెట్టినా సంఖ్య పదకొండే వచ్చింది.

"మనలో ఒకరు వాగులో మునిగిపోయారు" అంటూ అందరూ భోరుభోరున ఏడుస్తూ, గురువు గారి దగ్గరకు వెళ్ళారు. జరిగిన విషయం చెప్పి మళ్ళీ భోరున విలపించారు.

గురువుగారు అందరినీ తేరిపార చూశారు. శిష్యులను మళ్ళీ లెక్కపెట్టమన్నారు. ఒకడు లెక్కబెట్టాడు. మళ్ళీ పదకొండే వచ్చింది. గురువుగారు శిష్యులు చేసిన తప్పును గుర్తించారు. వారందరినీ వరుసలో నిలబెట్టి స్వయంగా లెక్కబెట్టారు. శిష్యులు తమ పొరపాటు తెలుసుకొని నవ్వారు.

### ఇవి చేయండి

**అ. ఆలోచించి చెప్పండి, రాయండి :**

1. శిష్యులు చేసిన పొరపాటు ఏమిటి ?
2. అడవికి వెళ్ళేటప్పుడు ఎందుకు లెక్కించుకోలేదు ?
3. పరమానందయ్య తన శిష్యులను ఎక్కడ లెక్కించాడు ?



ఆ. కింది వానిని గబగబా అనండి

1. చక్కెర కుండ - కుచ్చుల దండ
2. ఎర్రలారి - తెల్లలారి
3. జొన్నచొప్ప - జున్నుపాలు
4. గాదెలోన కందిపప్పు - గాదె కింద పందికొక్కు



ఇ. జట్లలో చేయండి.

కింది గళ్ళలోని అక్షరాలతో పదాలు రాయండి. ఎటునుంచైనా అక్షరాలను వరుసగా తీసుకోండి :

| | | | | |
|---|---|---|---|---|
| ట | పా | వు | రు | గు |
| వం | కా | య | ట | వా |
| క | ల | ము | మా | స |
| ర | చ | న | ట | న |
| ప | ల | క | డ | ప |

ఉదా. టపా; వంట; కల

ఈ. మీరందరూ గుండ్రంగా కూర్చోండి. మీలో ఒకరివద్ద ఒక బంతి ఉంచుకోండి. అతడు పై కథలోని మొదటి వాక్యాన్ని సొంతమాటల్లో చెప్పాలి. తరువాత బంతిని మరొకరికి విసరాలి. బంతి ఎవరివద్ద పడుతుందో అతను కథలోని తరువాత వాక్యం చెప్పాలి. ఈ విధంగా కథను సొంత వాక్యాలలో పూర్తిచేయండి.

ఉదా. అనగనగా ఒక గురువు ఆయన పేరు ..............







ఉ. మిమ్మల్ని బాగా నవ్వించిన సంఘటన చెప్పండి :

ఊ. చిత్రం చూసి ఒక్కొక్కరు ఒక్కొక్క వాక్యం చెప్పండి :



ఏ. మేము తెలుసా ?







ఏ. మమ్మల్ని గమనిస్తూ చదవండి :

సిరిపురం ఊరి చివర ఒక పెద్ద చెరువుంది. చెరువులో కలువలు, తామరపూలు, చేపలు, కప్పలు ఉన్నాయి. చెరువు గట్టున ఒక పెద్ద మర్రిచెట్టు వుంది. చెట్టు మీద కాకులు, పిచ్చుకలు, పావురాలు ఉన్నాయి.

## 5. మన పనిని మనమే చేసుకుందాం

పిల్లలూ ! మన పనులు మనం చేసుకోవడం మంచిది. పసిపిల్లలుగా ఉన్నప్పుడు మనకు అమ్మ ముఖం కడిగేది. స్నానం చేయించేది. బట్టలు తొడిగేది. అన్నం తినిపించేది. పెరిగి పెద్దయింతరువాత కూడ అమ్మే మన పనులు చేస్తే అంతా నవ్వుతారు కదా!

ఇంట్లో ఎన్నో పనులుంటాయి. అమ్మకు తీరికలేనంత పని ఉంటుంది. నాన్నకూ అంతే. వాళ్ళపనులతో పాటు మన పనులు కూడా చెయ్యాలంటే కష్టం. అమ్మకు, కూడా మనం పనులు చేసిపెట్టాలి. మనం పెరిగే కొద్దీ మన పనులు మనమే చేసుకోవాలి.

బడిలో కూడా మనం మన తరగతి గదిని శుభ్రంగా ఉంచుకోవాలి. బడి తోటను పెంచుకోవాలి.

గాంధీజీ తన పనిని తానే చేసుకొనేవాడు. సబర్మతీ ఆశ్రమంలో చీపురుపట్టి ఊడ్చేవాడు. తన బట్టలకు కావలసిన నూలును తానే వడికేవాడు. మరుగు దొడ్లు కూడ కడిగేవాడు. మురికివాడలను శుభ్రం చేసేవాడు. అలాగే మన పనులను మనమే చేసుకోవడానికి అలవాటు పడాలి.

శ్రమదానం కింద పాఠశాలలకు సున్నం వేస్తున్నారు. మొక్కలు నాటుతున్నారు. రోడ్లువేస్తున్నారు. చదువురాని వారికి రాత్రిపూట చదువు చెప్తున్నారు. ఇవన్నీ మనం చేయవలసిన పనులేగదా !





పిల్లలూ! మన పని మనమే చేసుకోవడం అంటే మన ఒక్కరి పని మాత్రమే చేసుకోవడం కాదు. అందరం కలిసి అందరికి పనికి వచ్చే పనులు చేయడం. ఇలా చేయడం వల్ల సహకార భావం పెరుగుతుంది. తృప్తి, ఆనందం కలుగుతాయి.



### ఇవి చేయండి

అ. చిత్రాలు చూసి చెప్పండి, రాయండి :

1. పిల్లలు ఏయేపనులు చేస్తున్నారు ?
2. ప్రజలు ఏం చేస్తున్నారు ?



ఈ చిత్రానికి చెందిన వాక్యాలు మీ వాచకంలో ఎక్కడ ఉన్నాయో గుర్తించండి. వాటిని మీ నోటు పుస్తకంలో రాయండి.

### ఇ. చెప్పండి, రాయండి :

1. మీ ఇంట్లోగాని, బడిలోగాని తోటను పెంచడానికి ఏ మొక్కలు నాటుతారు?
2. మీకు ఏ పూలంటే ఇష్టం ?
3. మీకు బాగా ఇష్టమైన పూవు ఏది? ఎందుకు?
4. మీ తరగతి గదిని శుభ్రంగా ఉంచడానికి మీరు ఏంచేస్తారు ?
5. గాంధీజీ ఆశ్రమం పేరు ఏమిటి ?

### ఈ. పదాలు రాయండి :

ఈ కింద ఇచ్చిన అక్షరాలతో వీలయినన్ని ఎక్కువ పదాలు రాయండి. ఆ పదాల్లో పాఠంలో వచ్చిన పదాలకు కింద గీత గీయండి.

ఐ, క, ద్రి, దా, బు

శ్ర, మ, కా, ర, స,

రం, కూ, నం, త్యం

ఉదా. కారం, శ్రమ, ..............



### ఉ. చదవండి, రాయండి :

ఈ కింది జాబితాను చదవండి. మీరు సొంతంగా చేసుకునే పనులకు '✓' ఉంచండి. ఇతరుల సహాయంతో చేసుకునే పనులకు 'x' ఉంచండి.

| వాక్యము | గుర్తు |
|---|---|
| పళ్ళు తోముకోవడం | |
| స్నానం చేయడం | |
| అన్నం తినడం | |
| పాఠశాలకు తయారు కావడం | |
| ఇంటి వద్ద చదవడం, రాయడం, లెక్కలు చేయడం | |
| బట్టలు ఉతుక్కోవడం | |
| పుస్తకాలు సర్దుకోవడం | |
| ఆటవస్తువులను సరిగా ఉంచుకోవడం | |
| గది శుభ్రం చేసుకోవడం | |
| తల దువ్వు కోవడం | |



### ఊ. పదాలు తయారు చేయండి, రాయండి :

ఈ కింది ప్రతి పదంలో మొదటి రెండక్షరాలతోను, చివరి రెండక్షరాలతోను పదాలు వస్తాయి. వాటిని రాయండి.

మైదానం, కాపురం, పారకం, లక్షణం, వసతి, సుమతి

ఉదా:- మైదానంలో మొదటి రెండక్షరాలతో పదం - మైదా
చివరి రెండక్షరాలతో పదం - దానం

ఇలా మిగిలిన వాటికి రాయండి. ఇటువంటివే మరికొన్ని పదాలు తెలుసుకొని రాయండి.

# 6. ఆంధ్రకేసరి

ఆంధ్ర కేసరి
జననం : 1872 మరణం : 20-5-1957

"రండి! కాల్చండి!!" అని సింహంలా గర్జించాడు. ఆంగ్లేయుల తుపాకులకు తన గుండెను ఎదురొడ్డాడు.

ఆ దేశ భక్తుడు ఎవరో తెలుసా? మన నాయకులలో ఒకరయిన టంగుటూరి ప్రకాశం పంతులుగారే.

ఆయన ప్రకాశం జిల్లా కనపర్తి అనే గ్రామంలో జన్మించాడు. ఆయనది సామాన్య కుటుంబం. ప్రకాశం చిన్నప్పుడే తండ్రి గోపాలకృష్ణయ్య మరణించాడు. తల్లి సుబ్బమ్మ పేదరికంతో బాధలు పడుతుండేది. అయినా ప్రకాశం చదువు మానిపించలేదు. పట్టుచీర తాకట్టు పెట్టి పరీక్ష ఫీజు కట్టింది.

ప్రకాశం చాలా తెలివి తేటలు కలవాడు. ఇమ్మానేని హనుమంతరావు అనే న్యాయవాది ఆయనను చేరదీశాడు. చదువు చెప్పించాడు. ప్రకాశం తరువాత ఇంగ్లాండు వెళ్ళాడు. బారిష్టరు పట్టం పొందాడు. మద్రాసు హైకోర్టులో న్యాయవాదిగా పనిచేశాడు. బాగా డబ్బు సంపాదించాడు.

అప్పుడు గాంధీజీ స్వాతంత్ర్య సమరంలో పాల్గొనవలసినదిగా ప్రజలకు పిలుపునిచ్చాడు. ఆ పిలుపునందుకొని ప్రకాశం స్వాతంత్ర్య పోరాటంలోకి దూకాడు. గాంధీజీకి అనుచరుడయ్యాడు. అప్పటి నుండి విదేశీ వస్తువులను వదిలిపెట్టాడు. ఖద్దరు దుస్తులను ధరించాడు. జైలు శిక్ష అనుభవించాడు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రకాశం మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయ్యాడు. అంతేకాదు, ఆంధ్రరాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రి కూడ ఆయనే.

వృద్ధాప్యంలో ఆయనకు తొడుక్కోవటానికి మంచి చొక్కా కూడలేదు. ఆయన తనకున్న దంతా దేశ ప్రజలకోసం త్యాగం చేశాడు. దేశాన్ని సొంత కుటుంబంగా ప్రేమించిన గొప్ప దేశభక్తుడు. తెలివి, ధైర్యం, పట్టుదల, గుండెనిబ్బరం, సహనం మొదలయిన గుణాలున్న మహానాయకుడు ప్రకాశం పంతులు. ప్రజల మనిషిగా ఆయన చరిత్రలో నిలిచిపోయాడు.



"రండి! దమ్ముంటే కాల్చండి!" అంటున్న ప్రకాశం

## ఇవి చేయండి

అ. 'ప్లీడరు' అనే అర్థం వచ్చే పదాలను పాఠంలో సున్నాచుట్టండి. ఇక్కడ రాయండి :

ఆ. కింది పదాలలో మొదటి అక్షరాన్ని ఆధారంగా చేసికొని అక్షర క్రమంలో పదాలను రాయండి :

గర్జించడం, స్వాతంత్ర్యం, పట్టుదల, ఖద్దరు, తుపాకి, అనుచరుడు, మద్రాసు, ఆంగ్లేయులు, ఇంగ్లాండు.

ఉదా. 1. అనుచరుడు

2.
3.
4.
5.
6.
7.
8.
9.

ఇ. కింది పట్టిక ఆధారంగా వాక్యాలు రాయండి :

| | | | |
|---|---|---|---|
| ప్రకాశం | బారిష్టరు | వెళ్ళాడు | |
| | ఇంగ్లాండు | గర్జించాడు | |
| | ఆంధ్రరాష్ట్రం | చదివాడు | |
| | దేశభక్తి | తొలిముఖ్యమంత్రి | |
| | సింహంలా | కలవాడు | |

ఉదా : 1. ప్రకాశం ఆంధ్రరాష్ట్రం తొలి ముఖ్యమంత్రి.

2. ______________

3. ______________

4. ______________

5. ______________

ఈ. మన రాష్ట్రానికి ఎవరెవరు ముఖ్యమంత్రులుగా పనిచేశారో తెలుసుకొని రాయండి :

ఉ. పాఠంలో నాల్గవ పేరాలో ఎన్ని (.) చుక్కలున్నాయో లెక్కించండి. ఆ చుక్కల ముందు ఉన్న పదాలను రాయండి :

ఉదా. కలవాడు.

______________

______________

______________

______________

______________

ఊ. కింది పేరాలో అవసరమైన చోట్ల అంటే వాక్యం చివర (.) చుక్కలుంచి రాయండి :

గాంధీజీ ఇంగ్లాండు వెళ్ళాడు బారిష్టరు చదివాడు భారతదేశం వచ్చి స్వాతంత్ర్య పోరాటం నడిపాడు స్వాతంత్ర్యం తెచ్చాడు ఆయనను ప్రజలమనిషి అంటారు



ఎ. మీరు చిన్న జట్లుగా విడిపొండి.

జట్టులో చర్చించుకొని పాఠంలో మీకు నచ్చిన '20' పదాలను గుర్తించండి.

- 20 చిన్న కార్డు ముక్కలను తీసుకోండి.
- ఒక్కొక్క కార్డు ముక్కపై ఒక్కొక్క పదాన్ని రాయండి.
- ఉపాధ్యాయుడు ఇచ్చే సూచనల ప్రకారం, మీ ముందున్న కార్డుల నుండి ఏరి వెంటనే ఇచ్చేయండి.
- సరిగా అందజేసి మార్కులు పొందండి.

సూచనలు :

ఉదా . - దేశభక్తుల పేర్లు రాసిన కార్డులు
- ప్రకాశం ముఖ్యమంత్రిగా పని చేసిన రాష్ట్రాల పేర్లు
- పాఠంలో న్యాయవాదుల పేర్లు ఉన్న కార్డులు
- ప్రకాశం గుణాలు తెలిపే కార్డులు.

(ఇలా మరికొన్ని సూచనలు ఉపాధ్యాయులు ఇవ్వాలి)

ఏ. ఆంధ్రకేసరిని గూర్చి సొంత మాటలతో ఐదు వాక్యాలు రాయండి.



## 7. పరుగో పరుగు



అడవిలో ఒక  ఉండేది. ఒకరోజు అది ఒక కింద నిద్రపోతున్నది. అకస్మాత్తుగా 'దబ్బు' మని చప్పుడు వినిపించింది.  ఉలిక్కిపడి నిద్రలేచింది. చప్పుడు ఎందుకయ్యిందో అని అటూ ఇటూ చూసింది. మళ్ళీ పడుకుంది. ఇంతలో మళ్ళీ 'దబ్బు' మని చప్పుడయింది. చుట్టూ చూసింది. ఆకాశం విరిగిపడిందని అనుకుంది. వెంటనే భయంతో పరుగెత్తింది. అలా పోతూవుంటే దానికి ఒక కలిసింది. ను" ఏం జరిగింది? ఎందుకు పరుగెత్తుతున్నావు" అని అడిగింది. "ఆకాశం విరిగి పడుతోంది పరుగెత్తు, పరుగెత్తు" అని అంది. పరుగెత్తడం మొదలుపెట్టాయి. వీటికి ఒక ఎదురైంది. "ఆగండి! ఆగండి! ఎందుకు పరుగెత్తుతున్నారు" అని అడిగింది. "ఆకాశం విరిగి పడుతోంది. నువ్వుకూడా పరుగెత్తు' అని చెప్పింది. పరుగెత్తసాగాయి. వీటికి ఒక కలిసింది, "ఏమయింది" ఎందుకు పరుగెత్తుతున్నారు?" అని అడిగింది. "ఆకాశం విరిగిపడుతోంది. అందుకు పరుగెత్తుతున్నాం. అని చెప్పింది. తో పాటు కూడా పరుగెత్తసాగింది.

కొంత దూరం పరుగెత్తగానే వాటికి ఎదురైంది. వాటిని "ఎందుకు పరుగెత్తుతున్నారు ? ఏమైంది?" అని అడిగింది. "ఆకాశం విరిగిపడుతున్నది. అందుకే పరుగెత్తుతున్నాం" అని రొప్పుతూ చెప్పింది.

కు ఇది విచిత్రంగా తోచింది. "ఆకాశం విరిగి పడ్డప్పుడు నువ్వు చూశావా?" అని అడిగింది. "నేను చూడలేదు. నాకు చెప్పింది" అని అంది.

"ఆకాశం విరిగిపడ్డప్పుడు నువ్వు చూశావా?" అని అడిగింది. " నాకు చెప్పింది" అని జవాబిచ్చింది. ను అడిగితే తనకు చెప్పిందని చెప్పింది.

"ఆకాశం విరిగి పడిందని నీకెలా తెలుసు? నువ్వుచూశావా?" అని ను అడిగింది. "నేను కింద నిద్రపోతున్నప్పుడు 'దబ్బు' అన్న చప్పుడు వినిపించింది. ఆకాశం విరిగి పడింది" అని చెప్పింది. "ఆ కిందకు వెళ్లి చూద్దాం" అని అంది. అన్నీకలిసి దగ్గరకు వెళ్లిచూశాయి. అక్కడ ఒక పెద్ద కన్పించింది. ఇంతలో 'దబ్బు' మని మళ్లీ ఒక పడింది. వెంటనే "అదిగో! మళ్లీ చప్పుడయ్యింది. ఆకాశం విరిగి పడుతోంది, పరుగెత్తండి !" అంది.

వెంటనే ను చూపిస్తూ "ఇదేనా విరిగిపడే నీ ఆకాశం" అని తో అనగానే సిగ్గుపడింది. మిగిలినవి నవ్వాయి.

## ఇవి చేయండి



అ. ఈ కింది మాటలు ఎవరు ఎవరితో అన్నారు ?

"ఏం జరిగింది? ఎందుకు పరుగెత్తుతున్నావు?"

"ఆకాశం విరిగిపడ్డప్పుడు నువ్వు చూశావా?"

పై వాక్యాలను పాఠంలో గుర్తించి వాటి కింద గీతగీయండి.

ఆ. ఆలోచించి జవాబివ్వండి, రాయండి :

- కుందేలు దబ్బుమనే చప్పుడు విని ఆకాశం విరిగిపడిందని ఎందుకు అనుకున్నది?
- పాఠంలోని జంతువుల్లో ఏది తెలివిగలది ? ఎందుకు ?
- కుందేలు ఎందుకు సిగ్గుపడ్డది ? మిగిలిన జంతువులు ఎందుకు నవ్వాయి ?
- నువ్వే కుందేలు అయితే ఏం చేస్తావు ?
- కొబ్బరి కాయతో నువ్వు ఏంచేస్తావు ?

ఇ. కింది బొమ్మలను చూడండి. రెంటికి ఉన్న పోలికలు, భేదాలను రాయండి :



ఈ. మీకు నచ్చిన ఒక జంతువు పటం గీయండి :



ఉ. కింది పటంలో ఏ జంతువుది ఏభాగం ఉందో రాయండి :



ఊ. ఒక్కో వరుసలో సంబంధం లేని పదాన్ని గుర్తించండి :

1. చిలుక, పిట్ట, కాకి, కుక్క
2. పావురం, కుందేలు, ఎద్దు, బర్రె
3. ఆవు, మేక, గాడిద, కోడి
4. వేపచెట్టు, తాడిచెట్టు, కొబ్బరిచెట్టు, ఈతచెట్టు
5. జామపండు, మామిడిపండు, అరటిపండు, మల్లెపూవు

ఎ. కొబ్బరికాయకు సంబంధం ఉన్న పదాలు రాయండి :



# 8. తెనాలి రామకృష్ణుడు - ఉపాయం



శ్రీకృష్ణదేవరాయల వారి తోటలో బూడిద గుమ్మడి కాయలు కాశాయి. కాసిన కాయలన్నిటినీ ఎవరో దొంగిలిస్తున్నారు. ఈ దొంగతనం సంగతి రాయలవారి దాకా వెళ్ళింది.

భటులు గుమ్మడి కాయల దొంగ ఎవరో తెలుసుకోలేక పోయారు. తోటలో కాపలాకాస్తున్న వీరయ్య, మల్లయ్య, లింగయ్యల మీద అనుమానం వచ్చింది. వారిని నేరుగా రాయలవారి ఆస్థానానికి తీసుకుని వెళ్ళారు. ఆ కొలువులో 'వికటకవి' తెనాలి రామకృష్ణుడు కూడా ఉన్నాడు. రాయలవారు ఈ సమస్యను వికటకవికి అప్పచెప్పారు.

రామకృష్ణుడు ఆ ముగ్గురిని పిలిచాడు. మంత్రించి ఇచ్చానని చెప్పి, ఒక్కొక్కరికి ఒక్కొక్క పుల్ల ఇచ్చాడు.

ఎవరు దొంగతనం చేస్తే, వారికిచ్చిన పుల్ల మరుసటిరోజుకు ఒక అంగుళం పెరుగుతుందని చెప్పాడు. జాగ్రత్తగా మరునాడు ఆ పుల్లలను తీసుకుని రమ్మనమని కూడా చెప్పాడు.

ముగ్గురూ ఇళ్ళకు వెళ్ళారు. మల్లయ్య తన కిచ్చిన పుల్ల ఎక్కడ పెరుగుతుందో అని భయపడి ఒక అంగుళం తుంచాడు.

ముగ్గురూ తమకిచ్చిన పుల్లలు తీసుకుని ఆస్థానానికి వచ్చారు. ఇద్దరి పుల్లలు అలాగే ఉన్నాయి. ఒకరి పుల్ల విరిచి ఉండటం రామకృష్ణుడు గమనించాడు. దొంగ దొరికి పోయాడు. అతడు తాను ఎలా దొరికి పోయిందీ తెలుసుకున్నాడు. సిగ్గుపడ్డాడు. క్షమాపణ వేడుకున్నాడు. రాయలవారు అతనిని మందలించి వదలివేశారు.



## ఇవి చేయండి

అ. ఆలోచించండి. జవాబులు రాయండి :

1. రామకృష్ణుడు నిజంగా పుల్లలను మంత్రించి ఇచ్చాడా ?
2. మల్లయ్య తన పుల్ల పెరుగుతుందని ఎందుకు భయపడ్డాడు ?
3. చివరి పేరాను చదివి దోషి ఎవరో చెప్పండి. ఎందుకు ?
4. దోషిని రామకృష్ణుడు ఎలా గుర్తించగలిగాడు ?

ఆ. ఈ పట్టికను పూరించండి :

| రాయలవారి తోటలో కాసినవి | రంగు | రుచి |
|---|---|---|
| నిమ్మపండు | పసుపుపచ్చ | పులుపు |
| టమాటాపండు | | |
| కాకరకాయ | | |
| మామిడిపండు | | |
| జామకాయ | | |
| నేరేడుపండు | | |
| సపోటాపండు | | |

ఇ. పై పట్టికను చూసి ఇలాంటి వాక్యాలు రాయండి :

ఉదా. నిమ్మపండు పసుపుపచ్చగా, పుల్లగా ఉంటుంది.

______________________________

______________________________

______________________________

______________________________

______________________________

______________________________





ఈ. ఏకవచనాలకు బహువచనాలు రాయండి :

ఉదా: గుమ్మడికాయ — గుమ్మడికాయలు
ఆట — ________
పాట — ________
కుర్చీ — ________

ఉదా: విత్తనం — విత్తనాలు
గోపురం — ________
మంచం — ________
కంచం — ________
పెనం — ________

ఉదా: బండి — బళ్ళు
రోలు — ________
కోడి — ________
కన్ను — ________
పండు — ________

ఉ. రాయండి :

'వికటకవి' ఈ పదం చదవండి. ఈ పదాన్ని ముందునుండి వెనక్కు చదివినా, వెనక నుండి ముందుకు చదివినా ఒకే అర్థం వస్తుంది కదూ!
ఇలాంటివి మూడక్షరాల పదాలు కొన్ని రాయండి

ఉదా : కిటికి ________________

ఊ. ఈ పాఠాన్ని నాటకీకరణ చేయండి :

ఎ. "భటులు గుమ్మడికాయల ________________ ________________ అప్పచెప్పారు".

పై పేరాలో ఎన్ని (.) చుక్కలున్నాయో, ఎన్ని (,) కామాలున్నాయో లెక్కించండి. రాయండి.

| (.) ముందున్నపదాలు | (,) ముందున్నపదాలు |
|---|---|
| ________ | ________ |
| ________ | ________ |
| ________ | ________ |

## 9. సయాల్ సాహసం



బాల్యంలోనే సాహసం చూపి ఎంతో మంది పిల్లలు జాతీయ బహుమతి అందుకున్నారు. వారిలో 'సయాల్ లహ్నబాయ్' ఒకరు. ఆమె గుజరాత్ రాష్ట్రంలో 'బరాఅతడ్' గ్రామంలో జన్మించింది. వీరిది ఆదిమవాసి కుటుంబం. ఈమె తండ్రి కార్మికుడు. ఈమెకు ఇద్దరు సోదరులు, ఒకసోదరి. సయాల్‌కు చదువు, ఆటలు, సంగీతమంటే చాల ఇష్టం. అదే గ్రామంలో నిర్మల అనే అమ్మాయి ఉండేది. ఆమె సయాల్‌కు మంచి స్నేహితురాలు, నిర్మలకు కూడా ఆటలంటే ఇష్టం. వీలు చిక్కినప్పుడల్లా వారు అడవికి వెళ్ళి ఆడుకునేవారు.

ఆ రోజు సెలవు దినం. సయాల్, నిర్మల ఆడుకోడానికి అడవికి వెళ్ళారు. అక్కడ దాగుడుమూతలు ఆడారు. అప్పుడు "హిస్... హిస్..." అనే శబ్దం వినబడింది. ఒక కొండచిలువ ఒక్కసారిగా నిర్మల కాళ్ళను చుట్టివేసింది. ఆమె బిగ్గరగా కేకలు వేసింది.

నిర్మల కేకలు విన్న సయాల్ పరుగుపరుగున వచ్చిచూసింది. దగ్గర ఉన్న కర్రతో కొండచిలువను బాదింది. కాని అది నిర్మలను వదలలేదు. సయాల్ "కొండచిలువ విషజంతువు కాదనీ, భయపడవద్దనీ" నిర్మలకు ధైర్యం చెప్పింది. తన చేతిని కొండచిలువ





నోటి దవడలకు అడ్డంగా పెట్టింది. బాగా నొక్కింది. దానికి ఊపిరి సలపకుండా చేసింది. ఉక్కిరిబిక్కిరి అయిన కొండచిలువ నిర్మలను వదలివేసింది. నిర్మల తప్పించుకొని పరుగెత్తింది. సయాల్ కూడా నేర్పుగా ఒక్క ఉదుటున తన చేతిని వెనక్కి లాగేసుకొని పరుగెత్తింది. సయాల్ సాహసంతో తనను కాపాడినందుకు నిర్మల కృతజ్ఞతలు తెలిపింది.

బాలలూ చూశారా! సయాల్ ఎంత సాహసాన్ని చూపిందో! ఆమె సాహసానికి మెచ్చి అప్పటి మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఆమెకు జాతీయ బహుమతి అందజేసింది.



## ఇవి చేయండి

అ. ఈ కింది పదాలకు అర్థాలు ఈ పుస్తకం చివర ఎక్కడ ఉన్నాయో గుర్తించి, రాయండి :

కార్మికుడు, బాదటం, నేర్పు, కృతజ్ఞతలు

ఆ. కింది వాక్యాలను వరుసలో పెట్టండి :

- సయాల్ కొండచిలువను ఊపిరి సలపకుండా చేసింది.
- సయాల్ స్నేహితురాలు నిర్మల
- కొండచిలువ నిర్మల కాళ్ళను చుట్టివేసింది.
- సయాల్, నిర్మల ఆడుకోవడానికి అడవికి వెళ్ళారు.
- సయాల్ కొండచిలువను కర్రతో కొట్టింది.
- కొండచిలువ ఉక్కిరిబిక్కిరై నిర్మలను వదిలివేసింది.
- సయాల్ తన చేతిని వెనక్కు తీసుకొని పరుగెత్తింది.

ఇ. చెప్పండి, రాయండి :

1. నీవు నిర్మలవైతే ఏమి చేస్తావు ?
2. నీవే సయాల్‌వైతే నిర్మలను ఎలా కాపాడుతావు ?
3. కొండచిలువ గూర్చి '5' వాక్యాలు రాయండి

ఈ. ఎవరు ఎలాంటి వారో పట్టికలో రాయండి :




| సయాల్ | నిర్మల |
|---|---|
| | |



ఉ. సరియైన మాటను బ్రాకెట్టులో రాయండి :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | భయం | బయం | భమం | [ ] |
| 2. | నిర్మల | నిర్యల | నిర్నల | [ ] |
| 3. | శబ్దం | శబ్దం | సబ్దం | [ ] |
| 4. | ధైర్యం | దైర్యం | దైరం | [ ] |
| 5. | క్రుతజ్ఞత | కృతజ్యత | కృతజ్ఞత | [ ] |

ఊ. ఇలాంటి పదాలను మరికొన్ని రాయండి:

పరుగు...................... పరుగుపరుగున
వెంట ...........................................
తొందర ...........................................
దగ్గర...........................................

ఎ. కింది వాక్యాలను చదివి పాఠం ఆధారంగా సరిగా రాయండి :

1. నిర్మలకు వంట చేయటం ఇష్టం.
2. సయాల్, నిర్మల ఆడుకోవడానికి పట్నం వెళ్ళారు.
3. సయాల్‌కు ముగ్గురు సోదరులు.
4. నిర్మల కొండ చిలువను కర్రతో కొట్టింది.
5. సయాల్ రాష్ట్ర బహుమతి అందుకొన్నది.

ఏ. మీకు తెలిసిన సాహస సంఘటనను తెల్పండి :

ఐ. కిందిపదాలను ఉపయోగించి కథ చెప్పండి రాయండి :
రాము - రవి - చెరువు - ఈత - సాహసం - బహుమతి



## 10. ఉయ్యాలండీ ! ఉయ్యాల !!

ఉయ్యాలండీ! ఉయ్యాల!
ఊహల పల్లకి ఉయ్యాల!!
ఉల్లాసంగా మనమంతా,
ఊగుదమండీ రారండీ !

అందాలొలికే జాబిల్లి
అందును మనకు ఊహల్లో,
తళతళ మెరిసే తారలనూ,
తాకుచు ముచ్చట లాడుదమూ !



రెక్కలు లేకనె మనమంతా
ఎక్కడికో పయనించెదము!
మబ్బుల తేరుల నెక్కెదమూ!
దబ్బున నింగికి ఎగిరెదమూ!!

బోసినవ్వుల పాపాయి,
బుడిబుడి నడకల బుజ్జాయి,
ఆడేపాడే అబ్బాయి!
అంతా కలసీ రారండీ!!



### ఇవి చేయండి

అ. మీ మిత్రులతో కలసి పాడండి :

ఆ. ఈ కింది అర్థం ఇచ్చే వాక్యాలు గేయంలో ఎక్కడ ఉన్నాయో గుర్తించండి. రాయండి :

1. రెక్కలు లేకున్నా ఆకాశంలో ఎగురుతున్నట్లుగా ఉంటుంది.
2. చందమామతో, చుక్కలతో ముచ్చటలాడుతున్నట్లుగా ఉంటుంది.

ఇ. చెప్పండి, రాయండి :

ఉయ్యాల ఊగుతూ ఉంటే నీకు ఏమి అనిపిస్తుంది ?

ఈ. ఈ గేయంలో ఒత్తులతో ఉన్న పదాలను గుర్తించండి, రాయండి :

ఉ. కింది ఉదాహరణలో ఇచ్చిన పదాలవంటి మరికొన్ని పదాలు రాయండి :

| | | | |
|---|---|---|---|
| ఉదా: | రెక్క | ఎక్కెదము | పాపాయి |
| | లక్క | ఎగిరెదము | బుజ్జాయి |
| | .............. | .............. | .............. |
| | .............. | .............. | .............. |
| | .............. | .............. | .............. |
| | .............. | .............. | .............. |

ఊ. కింది ఖాళీలను సరియైన పదాలతో నింపండి :

(నడకలు, మెరవటం, కాగటం, పొంగటం, విరగటం, చూడటం, నమలటం, కొట్టుకోవటం)

1. బుడిబుడి <u>నడకలు</u>  2. తళతళ ________
3. సలసల ________  4. పెళపెళ ________
5. కొరకొర ________  6. గిలగిల ________
7. బుసబుస ________  8. కరకర ________



# 11. జంతువులతో స్నేహం

హరి : తాతయ్యా ! రేపు మాబడికి సెలవు. మమ్మల్ని ఎక్కడికైనా తీసుకెళ్ళవూ?

లత : ఆ ! ఆ ! సినిమాకెళ్ళితే బాగుంటుంది.

తాతయ్య : హరీ ! నువ్వేమంటావు ?

హరి : సినిమాకు వద్దు తాతయ్య ! వనభోజనానికి వెళ్దాం.

లత : సరే తాతయ్య ! మనం జోసెఫ్, హమీద్, మమత, మహేష్‌ను కూడ తీసికెళదాం.

తాతయ్య : అలా అయితే అందరికీ ఈ విషయం చెప్పండి. వనభోజనానికి కావలసిన సామగ్రినంతా సమకూర్చుకుందాం.

లత : సరే తాతయ్యా !

* * *

హరి : చూడు తాతయ్యా ! జోసెఫ్ వద్దంటే వినకుండా వాళ్ళ టామిని తెచ్చాడు. అది మమ్మల్ని ఆడనివ్వడం లేదు. బంతిని నోట కరచుకొని పరుగిడుతోంది.

జోసెఫ్ : తాతయ్య ! టామి చాల మంచిది. దానికి మాతో ఆడుకోవాలని ఉండదా మరి?

హరి : టామి ఎంత మంచిదైతేనేం ? అది మన వెంబడి ఎందుకు తాతయ్యా?

తాతయ్య : హరీ ! అలా అనకూడదు, కుక్క చాల విశ్వాసమున్న జంతువు.

హమీద్ : అయితే తాతయ్య ! వాటికీ మనకూ స్నేహం ఎలా కుదిరిందంటావు ?

తాతయ్య : శ్రద్ధగా వినండి మరి ! ఆదిమానవుడు అడవుల్లో తిరిగేవాడు. గుహల్లో ఉండేవాడు. వేటాడి బతికేవాడు. అతడు మాంసం తిని పారేసిన ఎముకల కోసం తోడేళ్ళ జాతి జంతువులు వచ్చేవి. అప్పుడు వాటి పిల్లలను పట్టి గుహల్లో ఉంచుకొనేవాడు. వాటిని మచ్చిక చేసుకొనే వాడు. పెరిగి పెద్దవైన తరువాత వేటలో ఉపయోగించుకొనేవాడు. అవే నేడు మనం పెంచుకుంటున్న కుక్కలు.





హమీద్ : తాతయ్యా! కుక్కల సంగతిసరే ! మనకు పిల్లులతో స్నేహం ఎలాకుదిరింది?

తాతయ్య : అదీ చెబుతా వినండి. మానవుడు వేట మీదనే ఆధారపడి బతకలేదు. క్రమంగా వ్యవసాయం చేయడం నేర్చుకున్నాడు. పండిన ధాన్యాన్ని నిలువ చేసుకొనేవాడు. అప్పుడు ఎలుకలు ధాన్యాన్ని తింటూ పాడుచేసేవి. వాటిని చంపటానికి .....

హమీద్ : ఆ ! ఆ ! తెలిసింది. వాటిని చంపడానికి పిల్లుల్ని పెంచారన్నమాట.

తాతయ్య : అవును. వాటిని నెమ్మదిగా మచ్చిక చేసుకున్నాడు. అట్లాగే ఎద్దులను, గుర్రాలను, మేకలను, కోళ్ళను, పావురాలను మచ్చిక చేసుకొన్నాడు.

హరి : అయితే మన చుట్టూ ఉన్న ఈ పెంపుడు జంతువులన్నీ అడవులనుంచే వచ్చాయన్న మాట.

తాతయ్య : అవును. అడవులు మనకు అన్నీ ఇచ్చాయి. చుట్టూ చూడండి. పచ్చని చెట్లతో ఈ అడవి ఎంత అందంగా ఉందో ! తన అందంతో మనకు ఎంతో ఆనందం కలిగిస్తుంది. అడవులవల్లనే మనకు వర్షాలు కురుస్తున్నాయి. మన ఆరోగ్యానికి, జీవనానికి అడవులు చాల అవసరం.

హరి : బలే ! బలే ! అయితే మనమంతా అడవుల్ని, జంతువుల్ని రక్షించుకుందాం. ఏమంటావ్ తాతయ్యా ?

తాతయ్య : నీ ఆలోచన చాలాబాగుంది. సరే భోజనాలు చేద్దాం పదండి.



## ఇవి చేయండి

అ. ఆలోచించి జవాబులు చెప్పండి, రాయండి :

1. అడవులు మనకు ఏ విధంగా ఆనందాన్ని కల్గిస్తాయి ?
2. నీకు పెంపుడు జంతువులలో ఏది ఇష్టం ? ఎందువల్ల ?
3. అడవుల ఉపయోగాలు రాయండి ?
4. మీరు పాల్గొన్న విందుభోజనాన్ని గూర్చి చెప్పండి.

ఆ. కింది అక్షరాలతో వీలైనన్ని పదాలను రాయండి. వీటిలో పాఠంలోని పదాల్ని గుర్తించండి :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స్నే | తో | ళ్ళు | ఆ | డే | భో | క | లు |
| జ | మ | రో | కో | చ్చి | గ్యం | నం | హం |

ఉదా:- రోలు, తోలు, స్నేహం

ఇ. కింది పదాలతో సరైన వాక్యాలను రాయండి :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఉండేవాడు | ఆది | గుహల్లో | మానవుడు |
| 2. | వెళ్ళాము | మేము | వనభోజనానికి | |
| 3. | ధాన్యాన్ని | పాడుచేసేవి | ఎలుకలు | తిని |
| 4. | ఎద్దులను | బండ్లు | ఉపయోగిస్తారు | లాగటానికి |
| 5. | వర్షాలు | వల్ల | అడవుల | కురుస్తాయి |





ఈ. ఖాళీలలో రాయండి :

పిల్లీ ! పిల్లీ ! ఎక్కడికెళ్ళావు ?
పాలు తాగడానికి వెళ్తున్నా !

కోడీ ! కోడీ ! ఎక్కడికెళ్ళావు ?
______________________ !

మేకా ! మేకా ! ______________ ?
______________________ !

ఆవూ ! ఆవూ ! ______________ ?
______________________ !

______________ ఎక్కడికెళ్ళావు ?
______________________ !
______________________ ?
______________________ !

ఉ. కింది పదంలోని ప్రతి అక్షరంతో మొదలయ్యే మూడు అక్షరాల పదాలు రాయండి :

వనభోజనం

వ : వనం ______________
న : నటన ______________
భో : భోగం ______________
జ : జలం ______________
నం : నందనం ______________

ఊ. కింద తోకలు, జంతువులు ఉన్నాయి. ఏ తోక ఏ జంతువుదో గుర్తించండి. జతపర్చండి.



## 12. రెక్కల ఏనుగు

అనగా అనగా ఒకరాజు. ఆ రాజుకి ఒక పెద్దతోట. ఆ తోటకు కాపలాదారుడు సూరయ్య. అతని భార్య నరసమ్మ. వారు తోటలోనే కాపురం ఉండేవారు.

ఒక రోజు ఉదయం సూరయ్య తోటలో తిరుగుతున్నాడు. ఒక వైపున చెట్లు మేసి ఉండటం గమనించాడు. రాజుగారికి ఇది తెలిస్తే శిక్ష తప్పదేమోనని భయపడ్డాడు. తోటంతా తిరిగాడు. కంచె అంతా బాగానే ఉంది. మరి జంతువులు లోపలి కెలావచ్చాయి? సూరయ్యకు అర్థం కాలేదు.

ఆ రోజు నుండి ప్రతి రాత్రి సూరయ్య మాటువేసి కాపలాకాశాడు. పున్నమిరాత్రి వచ్చింది. వెన్నెల పిండారబోసినట్లుంది. సూరయ్య జాగ్రత్తగా చూస్తున్నాడు. ఇంతలో ఒక అద్భుతం జరిగింది. ఆకాశం నుండి ఒక కాంతి నెమ్మదిగా తోటలోకి దిగింది. అది ఒక అందమైన రెక్కల ఏనుగు. మిల మిలా మెరుస్తున్నది. సూరయ్య ఆశ్చర్యానికి అంతులేదు.

ఆ ఏనుగు తోటంతా తిరిగింది. తనకు ఇష్టమైన ఆకులన్నీ మేసింది. సూరయ్య ఏనుగును నెమ్మదిగా వెంటాడాడు. ఉదయం కావస్తోంది. ఏనుగు ఒక్క సారిగా ఘీంకరించింది. పైకి ఎగిరింది.



సూరయ్య గబుక్కున దాని తోకపట్టుకున్నాడు. ఆకాశంలో పయనించాడు. వింతలోకం చేరాడు. అక్కడ ఎటుచూసినా



రత్నరాసులే. భవనాలంతా బంగారుమయం. జంతువులు ఆకాశంలో ఎగురుతున్నాయి. పక్షులు మాట్లాడుతున్నాయి. పాములు తోకలపై లేచి పడగలు విప్పి నాట్యం చేస్తున్నాయి. ఆహా ! ఎన్ని వింతలు, ఎన్ని మాయలు ! సూరయ్య కోరిందే తడవుగా అన్నీ ప్రత్యక్షమయ్యాయి. తనకు కావలసినవన్నీ మూట కట్టుకున్నాడు. పున్నమి రోజు వచ్చింది. ఏనుగు తోక పట్టుకుని భూలోకం చేరాడు.



ఈ వింతలన్నీ సూరయ్య ఊరంతా చెప్పాడు. వింత వస్తువులన్నీ చూపాడు. కొంతమంది ఇతని మాటలు నమ్మలేదు. వారందరిని వింతలోకం తీసుకుపోతానన్నాడు. పున్నమి రోజు రాత్రి వారందరిని తోటకు రమ్మన్నాడు.

పున్నమి రోజు రానే వచ్చింది. అందరూ చూస్తుండగా రెక్కల ఏనుగు తోటలో దిగింది. తనకు కావలసిన మేత మేసింది. ఉదయం కాబోతుండగా ఘీంకరించి పైకి ఎగిరింది. సూరయ్య దాని తోక పట్టుకున్నాడు. అతని కాలును నరసమ్మ, ఆమె కాలు మరొకరు, ఇలా అందరూ వేలాడుతూ ఆకాశంలో ప్రయాణించసాగారు.

చివరలో మల్లమ్మ వేలాడుతున్నది. ఆమెకు ఒక సందేహం వచ్చింది. ఓపిక పట్టలేక పోయింది. "వింతలోకంలో గుమ్మడికాయలు ఎంత పెద్దవిగా ఉంటాయి?" అని పైవారిని అడిగింది. వారు తమ పైవారిని అడిగారు. చివరికి ఆ ప్రశ్న సూరయ్యకు చేరింది. సూరయ్య ఉత్సాహాన్ని ఆపుకోలేకపోయాడు. గుమ్మడికాయలు ఇంత పెద్దగా ఉంటాయని చూపబోయి చేతులు చాచాడు. అంతే … ______________________

______________________

______________________

(ఏమైందో రాయండి)

**ఇవి చేయండి**



అ. నాకే రెక్కలుంటే ?

______

ఆ. వింతలోకం ఎలా ఉండాలో ఐదు వాక్యాలలో చెప్పండి. రాయండి :

______



ఇ. ఎటునుండి చదివినా అర్థం వచ్చే మూడక్షరాల పదాలు రాయండి :

ఉదా:- పడగ - గడప

____ - ____

____ - ____

____ - ____

____ - ____

____ - ____

ఈ. కథ చెప్పుకుందాం :

విద్యార్థులు గుండ్రంగా కూర్చోవాలి. మొదటి విద్యార్థి కథలో ఒక వాక్యం చెప్పాలి. రెండవ విద్యార్థి రెండవ వాక్యం చెప్పాలి. ఇలా ఒక కొత్త కథను చెప్పుకుంటూ పోవాలి.

ఉదా:- అనగా అనగా ఒక రాజు ఉండేవాడు.
ఆ రాజుకు ఒక పెద్ద కోట ఉంది.

ఉ. చర్చించి, రాయండి :

రెక్కల ఏనుగు పాఠంలో తప్పెవరిది ? మల్లమ్మదా? సూరయ్యదా? అందరిదా? ఎందుకు?

______



ఊ. చిత్రం చూడండి. ఏం జరుగుతుందో రాయండి :





## 13. దేశమును ప్రేమించుమన్నా!

దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

స్వంత లాభం కొంతమానుకు
పొరుగువారికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవ వలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగ వలెనోయ్



అ. పాడండి :

ఆ. ఈ కింది అర్థాన్నిచ్చే వాక్యాలు పాటలో ఎక్కడ ఉన్నాయో గుర్తించండి :

1. ఇతరులకు సహాయపడాలి.
2. అందరు కలసిమెలసి ఉండాలి.

## 14. పిల్లల పండుగ



తన పుట్టినరోజున పిల్లలతో చాచా నెహ్రూ

పసిడి పాపల చాచాజీ
పుట్టినరోజు ఈ రోజు !
పిల్లల పండుగ ఈనాడు
ఎల్లరు మరువరు ఏనాడు !!

తన ఎదపై చాచాజీ
ఎర్రగులాబీ నిలిపాడు !
పిల్లల సుందర వదనాలే
చల్లని మదిలో నింపాడు !!

దేశం కోసం వెలిశాడు
దేశ ప్రగతి సాధించాడు !
శాంతి కపోతం ఎగరేసి
విశ్వశాంతినే చాటాడు !!



పిల్లలతో ముచ్చటిస్తున్న చాచా నెహ్రూ

మల్లె మనసుల పిల్లల్లో
చల్లని ప్రేమను నింపాడు !
బాలల హృదిలో నిలిచాడు
భారత నేతగ వెలిగాడు !!



### ఇవి చేయండి

అ. ఆలోచించి రాయండి :

1. ఈ గేయంలో ఎవరి గురించి ఉంది ?
2. పిల్లల పండుగను ఎప్పుడు జరుపుకుంటారు ? ఎందుకు ?

ఆ. చిత్రాన్ని చూసి రాయండి :

ఇ. మీరు బడిలో, ఇంట్లో జరుపుకొనే పండుగల పేర్లు పట్టికలో రాయండి :

| బడిలో జరుపుకొనేవి | ఇంట్లో జరుపుకొనేవి |
|---|---|
| | |



శాంతి కపోతాన్ని ఎగరేస్తున్న చాచా నెహ్రూ

ఈ. మీ బడిలో జరుపుకొనిన పండుగ గూర్చి చెప్పండి :

ఉ. కింది ఖాళీలను సంబంధిత పదాలతో నింపండి :

ఎర్రని : గులాబి, ______
తెల్లని : పాలు, ______
ఆకుపచ్చని : ______ ______
చల్లని : ______ ______
పుల్లని : ______ ______
నల్లని : ______ ______

ఊ. కింది తేదీల ప్రాముఖ్యతను తెలుసుకొని రాయండి :

| సెప్టెంబరు, 5 | అక్టోబరు, 2 | ఏప్రిల్, 14 |
|---|---|---|
| | | |

## 15. పులి ప్రశ్న - కుందేలు జవాబు

ఒక రోజు కుందేలు నక్కబావ పెండ్లికి బయలు దేరింది. అడవి గుండా పోతూఉంటే కుందేలుకు బాగా దాహం వేసింది. నీటి కోసం వెతుకుతూ వెతుకుతూ వాగు చేరింది. నీరు తాగబోయింది.

ఇంతలో ఒక పులి వచ్చింది. "ఆగు! ఈ వాగు నాది! నువ్వు ఈ నీళ్ళు తాగాలంటే నా ప్రశ్నలకు జవాబులు చెప్పాలి. లేకుంటే నిన్ను తిని నా ఆకలి తీర్చుకుంటా!" అంది.

కుందేలు సరే అంది.












పులి ఇలాంటి పొడుపు కథలు మరికొన్ని కుందేలును అడిగింది. వాటన్నింటికి కుందేలు జవాబు చెప్పింది. కుందేలు తెలివికి మెచ్చుకుని పులి వదలి పెట్టింది. కుందేలు నీరు తాగి వెళ్ళి పోయింది.

## ఇవి చేయండి

అ. చెప్పండి, రాయండి :

1. కింది వాటి నుండి కుందేలు చెప్పిన సరియైన జవాబులను పులి ప్రశ్నలకెదురుగా ( ) లలో రాయండి.
జింక, ఏనుగు, కవ్వం, నాలుక, ఎండ, నీడ

2. పులి మరికొన్ని పొడుపు కథలు అడిగింది కదా !
అవి ఏమై ఉంటాయి ?

ఆ. జట్లలో చేయండి :



- రెండు జట్లుగా కూర్చోండి.
- ఒక జట్టులోని వారు కొన్ని పొడుపుకథలను అడగాలి.
- మరొక జట్టువారు విడుపులు చెప్పాలి.
- ఒకసారి ఒక జట్టువారు, మరోసారి మరో జట్టువారు పొడుపులు వేయండి.

ఇ. రాయండి :

కింది బొమ్మలను చూసి, వాటిపై పొడుపు కథలను రాయండి.

ఉదా :- పసుపురంగులో ఉంటాను
ఐదక్షరాల పండును నేను
తియ్యగా ఉంటాను.
ఎండాకాలంలో దొరుకుతాను.









ఈ. చిత్రాన్ని చూడండి; కింది పొడుపు కథలకు జవాబులున్నాయి; గుర్తించండి :



1. అక్కడిక్కడి బండి అంతరాల బండి, మద్దూరి సంతలోన మాయమైన బండి.
2. ఏడుగురు అన్నదమ్ములం మేము.
విడిగా ఉంటే చెప్పగలవు, కలిసి ఉంటే చెప్పలేవు.
3. ఒక సీసాలో రెండురంగులు.
4. నిద్రిస్తూనే ఉంటాను, కాని కన్నుమూయను.
5. పచ్చని భవనం, తెల్లని గదులు, నల్లనిరాజులు.
6. మేసేది కాసంత. కూసేది కొండంత.



## 16. దుర్గాబాయి



దుర్గాబాయి
జననం : 15-07-1909
మరణం : 09-05-1981

ఒకసారి కాకినాడలో జాతీయ కాంగ్రెసు మహాసభలు జరిగాయి. అక్కడ ఒక ప్రదర్శన ఏర్పాటుచేశారు. ప్రదర్శన చూడాలంటే టిక్కెట్లు కొనుక్కోవాలి. టిక్కెట్టు చూసి లోపలికి పంపడానికి గేటు దగ్గర ఒక అమ్మాయిని నిలబెట్టారు. ఆ అమ్మాయి టిక్కెట్టు లేదని ఒకపెద్ద మనిషిని గేటు దగ్గర ఆపివేసింది. ఆయన పక్కనున్న మరొకాయన "ఆయన ఎవరనుకున్నావు? జవహర్‌లాల్ నెహ్రూ, లోపలికి పోనివ్వు" అన్నాడు. అయినా ఆ అమ్మాయి ఒప్పుకోలేదు. ఆమె ధైర్యానికి నెహ్రూ మెచ్చుకున్నాడు. ఆ అమ్మాయి ఎవరో మీకు తెలుసా?

ఆమె పేరు దుర్గాబాయి. రాజమండ్రిలో జన్మించింది. తల్లి కృష్ణవేణమ్మ. తండ్రి రామారావు. ఆమె తాతగారు సంఘసేవకులు. ఆయన పెంపకంలో దుర్గాబాయికి బాల్యంనుంచే సంఘసేవ పట్ల ఆసక్తి కలిగింది.

ఆనాటి ఆచారం ప్రకారం దుర్గాబాయికి చిన్ననాటనే వివాహమయింది. స్త్రీలు చదువుకోవలసిన అవసరం ఆమె గుర్తించింది. బాలికలకోసం పాఠశాల ఏర్పాటు చేసింది. తల్లికూడా ఆమె దగ్గరే చదువుకొంది. తల్లికి కూతురు గురువయింది. తమాషాగా లేదూ!

అప్పట్లో గాంధీగారు స్వాతంత్ర్యనిధికి విరాళాలు వసూలు చేస్తూ కాకినాడ వచ్చారు. పదకొండేళ్ళ దుర్గాబాయి నిధి వసూళ్ళు మొదలు పెట్టింది. ఆ డబ్బును గాంధీగారికి ఇచ్చింది. ఆయన దానిని అందుకుంటూ చిరునవ్వుతో "నీ చేతులకున్న బంగారు గాజులు కూడా ఇస్తావా?" అన్నాడు. దుర్గాబాయి వెంటనే తన చేతులకున్న బంగారు గాజులు



తీసి ఇచ్చింది. అంత చిన్న పిల్లకు ఎంత తెగువో !

గాంధీజీ పిలుపు ననుసరించి ఆమె శాంతిసేనలో చేరింది. స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంది. విద్యాసంస్థలను స్థాపించి నడిపింది. వైద్యశాలలను, ఆంధ్రమహిళాసభను స్థాపించింది. గొప్ప సంఘ సేవకురాలుగా ప్రజల హృదయాలలో నిలిచి పోయింది. స్త్రీలకోసం ఆమె ఎన్నో కార్యక్రమాలు చేపట్టింది. ఎన్నో సంస్థలు స్థాపించింది.



కాసు బ్రహ్మానందరెడ్డితో దుర్గాబాయి



దామోదరం సంజీవయ్యతో దుర్గాబాయి



కాంగ్రెసు కార్యకర్తగా దుర్గాబాయి

## ఇవి చేయండి

అ. దేశ నాయకుల, సంఘ సంస్కర్తల చిత్రాలను సేకరించి అతికించండి. వారిని గురించి నాలుగు వాక్యాలు చెప్పండి.

ఆ. **కింది సంభాషణలు చదవండి, అభినయించండి :**

1. దుర్గాబాయి : ఐదు వేల రూపాయల విరాళం తీసికోండి.
   గాంధీజీ : నీ చేతి బంగారు గాజులు కూడ ఇస్తావా ?
   దుర్గాబాయి : ఇవిగో ! గాజులు. తీసుకోండి.

పై విధంగా మొదటి పేరాలోని విషయాన్ని సంభాషణలుగా రాయండి. అభినయించండి.

2. దుర్గాబాయి : ____________
   పక్క వ్యక్తి : ____________
   దుర్గాబాయి : ____________
   నెహ్రూ : ____________


ప్రధాని నెహ్రూ, భర్త దేశ్‌ముఖ్‌లతో దుర్గాబాయి

ఇ. **పాఠంలోని వ్యక్తుల, పట్టణాల పేర్లు రాయండి :**

____________

____________

____________

____________

____________

____________

ఇటువంటి పేర్లను నామవాచకాలు అంటారు.

ఈ. **కింది వాక్యాలను పూరించండి :**

దుర్గాబాయి ____________లో జన్మించింది.
ఆమె తండ్రి ____________ .
ఆమె తల్లి ____________ .
దుర్గాబాయికి ____________ వివాహం అయింది.
ఆమె తన తల్లికి చదువు నేర్పి ____________ అయింది.
స్వాతంత్ర్య నిధికి ____________ వసూలు చేసింది.
దుర్గాబాయి గొప్ప ____________ .



ఉ. కింద గీతగీసిన పదాలకు సమానమైన అర్థంకల పదాలను పాఠంలో గుర్తించండి. రాయండి :

గాంధీజీ పోరుబందరులో పుట్టాడు.
ఆయన చిన్నతనం నుండి సత్యమే చెప్పేవాడు.
ఆయనకు సంఘసేవ చేయాలని కోరిక కలిగింది.
ఆయన స్వాతంత్ర్యనిధికి చందాలు వసూలు చేశాడు.

ఊ. **గళ్ళనుడికట్టు :**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | | 3 | | X |
| | X | | X | 4 |
| X | 2 | | X | |
| 5 | | X | 6 | |



**కింది ఆధారాలతో గళ్ళు నింపండి :**

**అడ్డం :**

1. 'పెళ్ళి' అని అర్థంవచ్చే నాలుగక్షరాల పదం.
2. తోడేస్తే పెరుగుగా మారుతుంది.
5. 'ఆటలు' కు ఏకవచనం.
6. 'పని' అని అర్థం వచ్చేపదం.

**నిలువు :**

1. ధనుస్సు
2. పాడుకొనేది
3. 'హక్కు' కు బహువచనం
4. ధైర్యంకు వ్యతిరేక పదం.

ఎ. **మేము గుర్తున్నామా ?**

మేము ఉండవలసిన చోట మమ్మల్ని ఉంచండి :

దశరథుడు అయోధ్యకు రాజు ఆయనకు నలుగురు కొడుకులు వాళ్లు రాముడు లక్ష్మణుడు భరతుడు శత్రుఘ్నుడు తండ్రి మాటను గౌరవించి రాముడు అడవికి వెళ్లాడు అతనితో సీత లక్ష్మణుడు కూడా వెళ్లారు వారికి అడవిలో హనుమంతుడు పరిచయమయ్యాడు.



## 17. ఎందుకనీ ?

ఎందుకనీ ? ఎందుకనీ ?
ఎందుకు, ఎందుకు, ఎందుకనీ ?

చక్కగ పండిన పండ్లన్నీ
నేలను రాలును ఎందుకనీ ?
మిలమిల మెరిసే తారకలూ
ఎన్నడు రాలవు ఎందుకనీ ?

గలగల పారే సెలయేరూ
ఎన్నడు ఆగదు ఎందుకనీ ?
కాంతిని చిమ్మే దీపశిఖా
పైకే చూస్తుందెందుకనీ?

పగలు కాసిన ఎండేమో
నిప్పులు చెరగును ఎందుకనీ ?
పండు వెన్నెల వెలుగేమో
చల్లగ ఉంటుందెందుకనీ ?

అంతేచిక్కని ఆకాశం
నీలిగ ఉందీ ఎందుకనీ ?
అందమైన ఆ హరివిల్లందు
ఏడు రంగులూ ఎందుకనీ ?

ఎందుకనీ ఎందుకనీ ?
ఎందుకు, ఎందుకు, ఎందుకనీ ?

### ఇవి చేయండి

అ. పాడండి :

ఆ. ఈ పాఠంలో ఎన్ని ప్రశ్నలున్నాయి ? వాటిని రాయండి.

ఇ. పాటలో ఈ వాక్యాలకు చెందిన ప్రశ్నలు ఎక్కడ ఉన్నాయో గుర్తించండి :

1. చెట్టునుండి పళ్ళు కిందికి పడతాయి.
2. ఆకాశం నీలి రంగులో ఉంటుంది.
3. పగలు ఎండ బాగా ఉంటుంది.
4. వెన్నెల చల్లగా ఉంటుంది.

ఈ. మీకు వింతగా అనిపించే వాటి గురించి ప్రశ్నలు రాయండి; జవాబులు తెల్సుకోండి :

ఉదా : 1. ఆకాశంలో విమానం చిన్నగా ఎందుకు కనిపిస్తుంది ?
2.
3.
4.
5.
6.
7.

ఉ. ఒక రోజు నక్క అడవిలో పోతున్నది. దానికి ఒక డబ్బా కన్పించింది. ఆసక్తితో ఆ డబ్బా మూత తెరచి చూసింది. దానిలోనుండి వింత ఆకారం బయటకు వచ్చింది. నక్క ఆశ్చర్యంతో దానిని రకరకాల ప్రశ్నలు వేసింది.




ఇలా చాలా ప్రశ్నలు అడిగింది.
నక్క ఏమేమి ప్రశ్నలు అడిగిందో, మీరు ఆ ప్రశ్నలు రాయండి.

## 18. పిసినారి ధనయ్య

బాలాపురం గ్రామంలో ధనయ్య అనే పిసినారి ఉండేవాడు. అతడు నేతి వ్యాపారం చేసేవాడు. అందరితో బాగా మాట్లాడేవాడు. అలా తన వ్యాపారాన్ని పెంచుకున్నాడు. వ్యాపారం పెరిగే కొద్దీ ధనయ్యకు దురాశ పెరిగింది. నేయి కల్తీ చేసి అమ్మడం మొదలుపెట్టాడు. బాగా సంపాదించాడు.

రాజయ్య ఆ ఊరిపెద్ద. అతని ఇంట్లో పెండ్లి. ఆరు డబ్బాల నెయ్యి కావాలని రాజయ్య ధనయ్యను అడిగాడు. ధనయ్య ఆయన ఇంటికి కూడ కల్తీ నెయ్యి పంపాడు. ఆ నేతి వంటకాలు తిన్న వారందరికీ వాంతులయ్యాయి. అది తెలుసుకొన్న రాజయ్య కోపంతో ధనయ్యను పిలిపించి పంచాయితీ పెట్టాడు.

పంచాయితీలో ధనయ్యపై విచారణ జరిగింది. ధనయ్య దోషి అని తేలింది. అతనికి మూడు శిక్షలు సూచించారు. ఏదైనా ఒకదానిని ఎన్నుకోమన్నారు. వెయ్యిరూపాయలు జరిమానా చెల్లించమన్నారు.
అమ్మో రూపాయలా!
చెల్లించనన్నాడు.
నూరు కొరడాదెబ్బలు





తినమన్నారు. చేతకాదన్నాడు. కల్తీనేయి ఒక కిలో తాగమన్నారు. ఇది లాభసాటిగా ఉన్నదని సరేనన్నాడు.

నెయ్యి తాగడం మొదలు పెట్టి పూర్తిగా తాగలేక పోయాడు. సరే నూరు కొరడా దెబ్బలు తింటానన్నాడు. యాభై దెబ్బల వరకు ఓర్చుకున్నాడు. ఆపై తట్టుకోలేక పోయాడు. చివరకు వెయ్యిరూపాయలు జరిమానా కూడా చెల్లించాడు.

దురాశ వల్ల పిసినారి ధనయ్య అన్ని శిక్షలూ అనుభవించాడు.

## ఇవి చేయండి

అ. కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పండి, రాయండి :

1. ధనయ్య ధనవంతుడు కావాలని ఏం చేశాడు ?
2. రాజయ్య కోపానికి కారణం ఏమిటి ?
3. ధనయ్య ఏ శిక్ష సులభం అనుకున్నాడు ? ఎందువలన?

ఆ. కింది పదాల్లో అక్షరాలు తారుమారుగా ఉన్నాయి. వాటిని సరిగా రాయండి :

ఉదా : వేచెపట్టు : వేపచెట్టు

1. పిరినాసి :
2. దుశరా :
3. కొడార :
4. మానాజరి:

ఇ. కింద కొన్ని పదాలు ఉన్నాయి. వాటితో ఖాళీలను పూరించండి :

వేయి, నూరు, ఆరుడబ్బాలు, ఒకకిలో, రాజయ్య, అనుభవించాడు, ధనయ్య, వాంతులు, నేతి, దురాశ, కల్తీ, పంచాయితీ

బాలాపురంలో__________ అనే వ్యాపారి ఉండేవాడు. అతడు నేర్పుతో __________ వ్యాపారం చేసేవాడు. వ్యాపారం పెరిగేకొద్ది ధనయ్యకు __________ పెరిగింది. దానితో నేయిని __________ చేసి అమ్మడం మొదలు పెట్టాడు.

ఆ ఊరి పెద్ద __________ అతని ఇంట్లో పెండ్లికిగాను __________ కల్తీనేయి పంపాడు. తిన్న వారందరికి __________ అయ్యాయి. కోపంతో రాజయ్య __________ పెట్టించాడు. పంచాయితీలో ధనయ్యకు __________ రూపాయల జరిమానా లేక __________ కొరడా దెబ్బలు లేక __________ కల్తీనేయి తాగాలని తీర్మానించారు. పాపం ధనయ్య తన పిసినారితనం వలన మూడు శిక్షలూ __________ .





ఈ. కింది పదాలకు వ్యతిరేక పదాలను పాఠంలో గుర్తించి రాయండి :

1. నిర్దోషి x __________
2. నష్టం x __________
3. శాంతం x __________
4. కొనడం x __________

ఉ. కింద చూపిన విధంగా ఇచ్చిన పదాల చివరి అక్షరంతో వీలైనన్ని పదాలు చెప్పండి, రాయండి :

ఉదా : వ్యాపారం - రంగా - గానుగ - గంట - టముకు

1. దురాశ -
2. జరిమానా -
3. కోపం -

ఊ. చెప్పండి, రాయండి :

ఒక గ్రామంలో దేవయ్య అనే పిసినారి ఉండేవాడు. అతడు ఒక కొబ్బరి కాయ కొనడానికి అంగడి కెళ్లాడు. ధర అడిగాడు. అంగడివాడు ఆరు రూపాయలన్నాడు. దేవయ్య ఒక రూపాయకు అడిగాడు. అంగడివాడు తోట కెళ్లి చెట్టెక్కి కోసుకోమన్నాడు. దేవయ్య చెట్టుఎక్కాడు.

ఆపై ఏం జరిగింది ?

__________

__________

__________

__________

__________



ఎ. ఈ కింది పదాలను చదవండి :

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాము 1 | తిన్నాడు 2 | అరటిపండు 3 | సీతకు 4 | ఆడారు 5 | బడికి 6 |
| తోటకు 7 | పాడారు 8 | హైద్రాబాదుకు 9 | వెళ్ళాడు 10 | కబడ్డి 11 | తిని 12 |
| ఆటలు 13 | దుకాణానికి 14 | గోపి 15 | కమల 16 | వెళ్ళారు 17 | మంగతో 18 |
| ఇచ్చాడు 19 | కొన్నాడు 20 | పెన్నులు 21 | పోయి 22 | వెళ్ళింది 23 | కొన్నది 24 |

1. కింది సంఖ్యల ప్రకారం పై పదాలను రాయండి
   ఏర్పడ్డ వాక్యాలను చదవండి

ఉదా : 1 3 2
రాము అరటిపండు తిన్నాడు.

ఏ. ఈ కింది వాక్యాలు రాయండి :

15 - 9 - 10
16 - 18 - 7 - 23
1 - 14 - 22 - 21 - 20
15 - 4 - 21 - 19
16 - 1 - 13 - 5

ఐ. సూచన ప్రకారం పదాలను రాయగా ఏర్పడ్డ తప్పు వాక్యాలను గుర్తించండి :

1 - 15 - 11 - 5
15 - 9 - 11 - 2
16 - 18 - 6 - 10
1 - 7 - 22 - 3 - 20
18 - 14 - 15 - 4
1 - 15 - 16 - 9 - 17



ఒ. జట్లలో చేయండి :

మీరంతా జట్లలో కూర్చుండి పై పదాలను వాడుతూ వాక్యాలను తయారు చేయండి. ఏ జట్టు వారు ఎక్కువ వాక్యాలను తయారు చేశారో చూడండి.



## 19. నేస్తాలు

మంచిమార్గం చూపేవారు
కష్టాల్లో కాపాడేవారు
ప్రేమతో నన్ను పిలిచేవారు
నేస్తాలూ! నా నేస్తాలూ!!

ఆటపాటలలో అలగనివారు
కమ్మని కబుర్లు చెప్పేవారు
కలకాలం కలిసుండేవారు
నేస్తాలూ! నా నేస్తాలూ!!

కల్లాకపటం లేనివారు
కులమత భేదం కాననివారు
హెచ్చు తగ్గులు ఎంచని వారు
నేస్తాలూ! నా నేస్తాలూ!!

సమతా మమతలు పెంచేవారు
సౌజన్యాన్ని పంచేవారు
ఎల్ల వేళలా కాచేవారు
నేస్తాలూ! నా నేస్తాలూ!!



## ఇవి చేయండి

అ. గేయాన్ని అభినయిస్తూ పాడండి :

ఆ. చెప్పండి, రాయండి :

1. నీ మిత్రులు ఎవరు ?
2. నీకు బాగా ఇష్టమైన మిత్రుడు ఎవరు ? అతనంటే నీకు ఎందుకు ఇష్టం?

ఇ. పాఠం చూసి చెప్పండి, రాయండి :

కింది పదాలకు సరిపడ వ్యతిరేకపదాలు పాఠంలో ఎక్కడ ఉన్నాయో చెప్పండి.

1. చెడు, 2. సుఖం, 3. నిజం, 4. శత్రువు

ఈ. రాయండి :

ఇటువంటివే మరికొన్ని జంట పదాలు రాయండి

| | |
|---|---|
| 1. ఆటపాటలు | 2. హెచ్చుతగ్గులు |
| 3. | 4. |
| 5. | 6. |

ఉ. ఈ కింది వాక్యాలలో గీతలు గీసిన పదాలకు బ్రాకెట్లలో అర్థాలు రాయండి :

1. రాజూ, గోపీ కలసి మెలసి ఉంటారు. వారిద్దరూ మంచి నేస్తాలు (            ). ఒకరిపై ఒకరికి మమత (            ) ఉంది.
2. రాజు పెన్సిల్ అతని తమ్ముడు తీసుకున్నాడు. కాని తీసుకోలేదని బుకాయించాడు. "నీవు చెప్పినది కల్ల (            ) నిజం చెప్పమని రాజు అన్నాడు.
3. నేస్తాలు కలకాలం (            ) కలసి మెలసి ఉంటారు.







ఊ. నీవైతే ఏం చేస్తావు ?

రంగన్న, మల్లన్న ఇద్దరూ మంచి మిత్రులు. వాళ్ళిద్దరూ ఒక రోజు మామిడికాయలు కొనేందుకు మామిడి తోటకు వెళ్ళారు. వాళ్ళిద్దరూ తోటకు వెళ్ళే సమయానికి తోటమాలి రామయ్య అక్కడలేడు. రంగన్న చెట్టు ఎక్కి మామిడి కాయలు కోయటం మొదలు పెట్టాడు. చెట్టుకింద మల్లన్న కాయలు పోగుచేస్తున్నాడు. ఇంతలో తోటమాలి రామయ్య మామిడి కాయలు కోసేదెవరని కేకలువేస్తూ వచ్చాడు. ....................................... ???

తర్వాత ఏమైంది? సొంత మాటలలో చెప్పండి.

నువ్వే మల్లన్నవైతే ఏంచేస్తావు?

నువ్వే రంగన్నవైతే ఏంచేస్తావు?

నువ్వే తోటమాలివైతే ఏం చేస్తావు ?



# 20. పరోపకారం



కాంతిపురాన్ని చంద్రశేఖరుడనే రాజు పాలించేవాడు. ప్రజలను కన్న బిడ్డల్లాగా చూసుకునేవాడు. అతనికి ఒకసారి తీవ్రమైన కడుపునొప్పి వచ్చింది. వైద్యులు ఎన్నోరకాల మందులు ఇచ్చారు. కాని రాజుకు నొప్పి తగ్గలేదు. రోజురోజుకు నొప్పి ఎక్కువ కాసాగింది. అప్పుడు రాజగురువు రాజుతో "రాజా ! కాకులు దూరని కారడవుల్లో ఒక చిత్రమైన మూలిక ఉంటుంది. దాని ఆకులు మిలమిలా మెరుస్తాయి. ఆ మూలిక పేరు అమృతవల్లి. ఆ మూలికను తెచ్చి వాడితే ఎటువంటి కడుపు నొప్పైనా తగ్గుతుంది" అని అన్నాడు. రాజుగారు ఆ మూలికను తెచ్చిన వారికి రాజ్యంలో సగభాగాన్ని ఇస్తానని దండోరా వేయించాడు. చాలా మంది అమృతవల్లి మూలికను తేవాలని ప్రయత్నించారు. కాని ఎవ్వరికీ సాధ్యం కాలేదు.

భద్రుడు అవంతీపురరాజ్యానికి చెందిన యువకుడు. ధైర్యసాహసాలు, దయాగుణం కలవాడు. దేశదేశాల వింతలు తెలుసుకుంటూ కాంతిపురానికి వచ్చాడు. అక్కడ పేదరాసి పెద్దమ్మ కాంతిపుర రాజ్యవిశేషాలను చెప్పింది. రాజుగారి మంచితనం గురించి, అతని అనారోగ్యం గురించి మరీమరీ చెప్పింది. అమృతవల్లి మూలికను సంపాదిస్తే అర్ధరాజ్యం వస్తుందనీ, ప్రయత్నించమనీ సలహా ఇచ్చింది.





మంచి వారికి సాయం చేయడం కోసం ఏమైనా చేస్తానన్నాడు భద్రుడు. నాకు రాజ్యం అవసరంలేదన్నాడు. అమృతవల్లి మూలిక తేవడానికి సిద్ధమయ్యాడు. మరునాడు ఉదయం బయలుదేరాడు.

చాలా దూరం నడిచి ఒక అడవిని చేరుకున్నాడు. అలిసిపోయి దారిలో ఒక చెట్టుకింద కూర్చున్నాడు. చెట్టుపైన గండభేరుండపక్షి గూడు ఉంది. ఆ గూటిలో పక్షిపిల్లలు ఉన్నాయి. అవి ఆకలితో అరుస్తూ ఉండడం భద్రుడు గమనించాడు. తన ఆహారంలో కొంత తీసి వాటికి తినిపించాడు. అలసి ఉన్నందున భద్రునికి నిద్రపట్టింది. కొంతసేపటికి పక్షి పిల్లలు భయంతో అరవడం వినిపించింది. భద్రునికి మెలకువ వచ్చింది. ఒక సర్పం పక్షి పిల్లల్ని తినడానికి గూటివైపు జరజరా పాకడం గమనించాడు. వెంటనే భద్రుడు సర్పాన్ని వెళ్ళగొట్టాడు.

ఇంతలో గండభేరుండపక్షి తన గూటికి వచ్చింది. తమ ప్రాణాలను భద్రుడు ఎట్లా రక్షించాడో, పిల్లలు తల్లితో చెప్పాయి. తన పిల్లలను కాపాడినందుకు, పక్షి భద్రునికి కృతజ్ఞతలు తెలిపింది. "ఏం సాయం కావాలన్నా చేస్తాను" చెప్పమంది. భద్రుడు అమృతవల్లి మూలిక కావాలని అడిగాడు.

భద్రుడు చెప్పింది విని, గండభేరుండపక్షి అతనికి ఏ విధంగా సాయం చేసిందో, ఆలోచించి చెప్పండి.



## ఇవి చేయండి

**అ. కింది మాటలను ఎవరు ఎవరితో అన్నారు ? రాయండి :**

| వాక్యం | ఎవరన్నారు | ఎవరితో అన్నారు |
|---|---|---|
| - కాకులు దూరని కారడవిలో ఒక చిత్రమైన మూలిక ఉంటుంది. | ................ | ................ |
| - ఏంసహాయం కావాలన్నా చేస్తాను | ................ | ................ |
| - ఆ మూలికను తెచ్చిన వారికి రాజ్యంలో సగభాగాన్ని ఇస్తాను. | ................ | ................ |

**ఆ. ఆలోచించండి, రాయండి :**

- భద్రుడు చేసిన మంచిపనులు ఏవి ?
- గండభేరుండపక్షి ఏ విధంగా సాయం చేసిందని ఊహించారో చెప్పండి.
- పేదరాసి పెద్దమ్మ చేసిన మంచి పని ఏది ?
- 'కాకులు దూరని కారడవి' ఎలా ఉంటుంది ?
- నీవు ఇతరులకు ఏమి సహాయం చేశావు? ఎప్పుడు చేశావు?

**ఇ. మాట్లాడకుండా అభినయించండి :**

- కడుపు నొప్పివచ్చినట్లు
- వైద్యుడు రోగిని పరీక్షిస్తున్నట్లు
- అరటి తొక్కను తొక్కి జారినట్లు

ఇలాంటివే మరికొన్ని చేయండి. ఏమి చేశారో మీ మిత్రులను చెప్పమనండి.

**ఈ. ఈ కింది వాక్యాలను చదవండి :**

రామయ్య మంచి రైతు. అతడు రకరకాల పంటలను పండిస్తాడు. దేవమ్మ రామయ్య భార్య. ఆమె భర్తకు పనుల్లో సహాయపడుతుంటుంది. రాజు, రాధ, రామయ్యదేవమ్మల సంతానం. వారు చక్కగా బడికి పోతారు.

గీతగీసిన పదం ఎవరిని తెలియజేస్తుంది.

అతడు =

ఆమె =

వారు =



**ఉ. సరైన పదాన్ని గీతగీసిన పదానికి బదులుగా రాయండి :**

ఉదా : సరళ తెలివైన బాలిక. — ఆమె తెలివైన బాలిక

1. సీత చక్కగా పాడుతుంది. ................
2. రాజు, రవి స్నేహితులు. ................
3. రామయ్య పొలంలో పని చేస్తున్నాడు. ................
4. పిల్లి పాలు తాగుతుంది. ................

నామవాచకాలకు బదులుగా వాడే వాటిని సర్వనామాలంటారు.
ఉదా. అతడు, ఆమె, వారు, అది ...... మొదలగునవి.

**ఊ. ఈ కింది ఖాళీలలో సరైన పదాలను రాయండి :**

మిలమిల మెరవటం
జరజర ________
జలజల ________
కిలకిల ________
విలవిల ________
వలవల ________
మలమల ________
గణగణ ________

**ఎ. కింది పదాలతో వాక్యాలు చెప్పండి, రాయండి :**

1. పాము
2. గద్ద
3. చందమామ

**ఏ. కింది రెండు పదాలను ఒకే వాక్యంలో ఉపయోగించి చెప్పండి, రాయండి:**

1. పాము, కర్ర
2. పాము, గద్ద
3. పాము, చందమామ
4. చందమామ, జరజర
5. పాము, చెట్టు
6. పాము, టి.వి.

## 21. కోతి ఉపవాసం

ఒక కోతి ఒకరోజు స్వామిజీ ఉపన్యాసం విన్నది. దానికి ఉపన్యాసం చాలా నచ్చింది. ఒక పర్వదినాన రోజంతా ఉపవాసం చేయాలనుకుంది. జపం చేయడానికి నిశ్చయించుకుంది. పని అంతా పూర్తి చేసుకుంది. కూర్చొని జపం మొదలుపెట్టింది.

ఉన్నట్టుండి దానికొక సందేహం వచ్చింది. "ఈ రోజంతా ఉపవాసం చేసి జపం చేస్తుంటే, రేపు నాకు చాల నీరసంగా ఉంటుందేమో! అప్పుడు మరి చెట్టునుంచి చెట్టుకు దూకి పళ్ళు కోసుకోగలనా? నీరసం మరీ ఎక్కువైపోతే! ఎలా? ఏమీ చెయ్యలేనేమో ?"

ఈ ఆలోచన వచ్చాక, కోతి జపం చేయటం ఆపింది. అప్పటికప్పుడు లేచి చెట్టుపుట్టా గాలించి మరునాటికి సరిపడే ఆహారం సేకరించింది. దానిని ఒక మూల భద్రపరిచింది. మళ్ళీ జపం కొనసాగించింది.

మరి కొంత సేపటికి కోతికి ఇంకో ఆలోచన వచ్చింది. "రేపు నీరసం వల్ల నేను నడవలేకపోతేనో? ఆహారం నాముందే ఉంచుకొని కూడ ఆకలితో అలమటించి పోతాను కాబోలు!" ఈ ఆలోచనతో పాపం కోతి ఎంతో బాధపడిపోయింది. వెంటనే లేచింది. ఆహారాన్ని తన చేతికి అందుబాటులో ఉంచుకుంది. మళ్ళీ జపం ఆరంభించింది.





ఆ కోతికి కొంతసేపటికి మరో ఆలోచన వచ్చింది. "ఒకవేళ నేను మరీ నీరసించిపోయి ఆహారాన్ని అందుకొని నోటిలో కూడా పెట్టుకోలేకపోతేనో." అంటూ జరగబోయేది ఊహించుకుంది. ఆహారాన్ని నోటిలోనే ఉంచుకొని ఉపవాసంతో జపం చేయాలనుకుంది. ఆ విధంగానే అది ఆహారాన్ని నోటిలో పెట్టుకుని జపం చేయబోయింది. కాని నోటిలో నిండుగా ఆహారం పెట్టుకొని జపం ఎట్లా చేస్తుంది ?

చివరకు కోతి బాగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకుంది. "భోజనం నోట్లో ఉంచుకోవడం ఎందుకు ? ఇప్పుడైతే ఏమిటి ? రేపైతే ఏమిటి ? ఎలాగూ అది నేను తినవలసిందేకదా! అందువల్ల ఈ ఆహారం ఇప్పుడే తినేసి కూర్చుని, సుఖంగా జపం చేసుకుంటాను" అనుకుంది. తనకు వచ్చిన ఈ గొప్ప ఆలోచనకు ఎంతగానో మురిసిపోయింది. ఆహారం తీసుకుంది. నిద్ర ముంచుకొచ్చింది. స్వామిజీ ఉపన్యాసం మరచిపోయింది. పక్క పరచుకుంది. హాయిగా నిద్రపోయింది.



**ఇవి చేయండి**

**అ. కింది వాక్యాలలో గీత గీసిన పదాల అర్థం తెలుసుకొని రాయండి :**

1. శివరాత్రి పర్వదినం. ఆ రాత్రి జాగరణ చేస్తారు.
   పర్వదినం =
2. ఏకాదశి రోజున ఉపవాసం చేస్తారు.
   ఉపవాసం =
3. గాజుగ్లాసులు పగలకుండా భద్రంగా పెట్టాలి.
   భద్రంగా =

**ఆ. కింద ఇచ్చిన పదాలతో ఖాళీలను సరిగా పూరించండి :**
(ఊహించాడు, నీరసం, నచ్చింది, గాలించి)

1. అన్నం తినక పోవడం వల్ల నాకు ...................... వచ్చింది.
2. ఆకలితో ఉన్న నల్లపిల్లి ఎలుకను ........................ పట్టుకుంది.
3. మామయ్య ఇచ్చిన పెన్ను నాకు ఎంతగానో ......................
4. రైతు నల్లటి మబ్బులను చూచి వానవస్తుందని......................

ఇ. ఈ కింది వాటికి ఒక అక్షరం లేదా రెండు అక్షరాలు ముందు చేరిస్తే, కొత్తపదం తయారౌతుంది. ఆ పదాలు ఏమిటి ? పాఠంలో అవి ఎక్కడ ఉన్నాయో కనుక్కోండి:

.........రసం; .........హారం; .........జనం; .........దేహం; .........వాసం;

ఈ. ఆలోచన, కొంతసేపు, బాధపడి, నిర్ణయం, నోట్లో, సుఖంగా, స్వామిజీ, నిద్ర, చెట్టు, పుట్ట, నిశ్చయించు, పూర్తి, ఉన్నట్టుండి, పళ్లు, ఆరగించు

పై పదాల్లో నీకు నచ్చిన వాటిని కింది గళ్లలో రాయండి.

| | | |
|---|---|---|
| | | |
| | | |
| | | |

ఉపాధ్యాయుడు ఏ పదాన్ని చెప్తాడో, ఆ పదాన్ని సున్నాతో చుట్టండి. గళ్ళలోని అన్ని పదాలు పూర్తికాగానే చేతులెత్తండి.

ఉ. కింది ప్రశ్నలకు జవాబులు రాయండి :

- స్వామిజీ ఉపన్యాసంలో ఏమిచెప్పాడు ?
- కోతి ఏ ఏ ఆహార పదార్థాలను సేకరించింది ?
- కోతి ఎందుకు ఉపవాసం చేయాలనుకుంది ?
- కోతి ఎన్ని సార్లు ఆలోచించింది ?
- కోతి ఎప్పుడెప్పుడు ఆలోచించింది ?
- ఈ కథకు కింది పేర్లలో ఏ పేరు పెడ్తే బాగుంటుంది? ఎందుకు?
  1) కోతి చేష్టలు 2) కోతి జపం 3) కోతి సోమరితనం

ఊ. గీత గీసిన పదాల స్థానంలో బహువచనం ఉంచి వాక్యాన్ని సరిచేయండి :

- తోటలో జామచెట్టు ఉన్నది.
- జామ చెట్టుపై కోతి ఉన్నది.
- కోతి జామ పండు తింటున్నది.





ఎ. కారణాలు రాయండి :

| విషయం | కారణాలు |
|---|---|
| - కోతి జపం చేయడానికి | |
| - తనకు రేపు నీరసంగా ఉంటుందేమో అనుకోవడానికి | |
| - ఆహారాన్ని కోతి తన చేతికి అందుబాటులో ఉంచుకోవడానికి | |
| - జపం చేయడానికి వీలు లేక పోవడానికి | |
| - కోతి జపం చేయక పోవడానికి | |

ఏ. వాక్యాలను సరిచేసి రాయండి :

- కోతి జపం నిశ్చయించుకొంది చేయడానికి
- ఆహారాన్ని అందుబాటులో తన చేతికి ఉంచుకొంది
- ఆహారాన్ని జపం ఉంచుకొని నోటిలో చేయడం ప్రారంభించింది
- సుఖంగా చేసుకుంటాను జపం తిని ఆహారం
- ఉపన్యాసం మరచి స్వామిజీ పోయింది

ఐ. చిత్రాన్ని చూసి కథ చెప్పండి :



# 22. హైదరాబాదు

మాధురి : రాజూ ! మూడు రోజుల నుండి బడికి రావడం లేదు. ఎక్కడి కెళ్ళావ్ ?

రాజు : హైదరాబాదు వెళ్లాను.

మాధురి : ఒక్కడివేనా ?

రాజు : ఉహూ ! మా అమ్మా, నాన్నా కూడా వచ్చారు.



చార్మినార్

మాధురి : అట్లాగా! హైదరాబాదులో ఏం చూశారు మరి ?

రాజు : చాలా చూశాం. మొదటి రోజు జూపార్కు చూశాం. జూలో ఎన్నో జంతువులు, పక్షులు ఉన్నాయి. సింహాలు, పులులు, ఖడ్గమృగాలు, ఏనుగులు, కోతులు, జింకలు, తాబేళ్లు, మొసళ్లు, నెమళ్లు, చిలుకలు చూశాం. జిరాఫీని కూడా చూశాం. దాని మెడ ఎంత పొడుగ్గా ఉందో ! అడవిదున్నలు చాలా బలంగా ఉన్నాయి.

మాధురి : జూ అంటే జంతు ప్రదర్శనశాల కదా ! అన్ని రకాల జంతువులూ ఉంటాయి మరి !

రాజు : నిజమే! హైదరాబాదులో వస్తు ప్రదర్శనశాల కూడా ఉంది. దాన్ని సాలార్‌జంగ్ మ్యూజియం అంటారు. సాలార్‌జంగ్ మ్యూజియంలో ఎన్నో శిల్పాలు, చిత్రాలు, బొమ్మలు ఉన్నాయి. మన పూర్వులు ఉపయోగించిన కత్తులు, తుపాకులు మొదలయిన ఆయుధాలు కూడా ఉన్నాయి. రాజులు వాడిన కుర్చీలు, బల్లలు ఉన్నాయి.







గోల్కొండ కోట



హుస్సేన్‌సాగర్‌లోని బుద్ధ విగ్రహం

మాధురి : రాజూ ! సాలార్‌జంగ్ మ్యూజియంలో నీకు బాగా నచ్చిన వస్తువేమిటి ?

రాజు : గంటలు కొట్టే గడియారం. ఈ గడియారంలో ఒక తలుపు ఉంది. సమయం అయినప్పుడు ఒక మనిషి బొమ్మ తలుపు తెరచుకొని బయటికి వస్తుంది. గంటలు కొట్టి మళ్లీ లోపలకు వెళ్తుంది.

మాధురి : విచిత్రంగా ఉంది. ఇంకా ఏం చూశారు?

రాజు : హుస్సేన్‌సాగర్‌కి వెళ్ళాం. హుస్సేన్‌సాగర్‌లో పెద్ద బుద్ధవిగ్రహం ఉంది. టాంకుబండు మీద శాతవాహనుడు, రుద్రమదేవి, కృష్ణదేవరాయలు, నన్నయ, తిక్కన, పోతన మొదలయినవారి విగ్రహాలున్నాయి.

మాధురి : ఇన్ని విగ్రహాలు అక్కడ ఎందుకు పెట్టారో !

రాజు : వీళ్లంతా చాలా గొప్పవారట. ఈ విగ్రహాలు చూస్తే వాళ్ల గుర్తుకు వస్తారట. మా నాన్న చెప్పారు.

మాధురి : అట్లాగా ! బాగుంది.

రాజు : హుస్సేన్ సాగర్ పక్కనే లుంబిని వనం ఉంది. సచివాలయం, తెలుగుతల్లి, పొట్టి శ్రీరాములు విగ్రహాలు, బిర్లా మందిరం, రవీంద్రభారతి, అసెంబ్లీ, పబ్లిక్‌గార్డెన్స్ అన్నీ దగ్గరదగ్గరగానే ఉన్నాయి.

మాధురి : అవన్నీ చూశావా! చార్మినార్ భలే ఉంటుందట. చూశారా ?

రాజు : ఆ! చార్మినార్ నాలుగు రోడ్ల మధ్య ఉంది. దానికి నాలుగు గోపురాలున్నాయి. పక్కనే మక్కా మసీదు ఉంది. నీటిని నాలుగు వందల సంవత్సరాల కింద కట్టారట. చివరి రోజు గోల్కొండ కోట కూడా చూశాం. అందులో రామదాసు చెరసాల ఉంది. కోటలో కింద ద్వారం వద్ద చప్పట్లు కొడితే దూరంగా కొండ మీది భవనంలో వినిపిస్తుంది. కోటలో భవనాలు చాలా వరకు కూలిపోయాయి. నాకు చాలా బాధ కలిగింది.

మాధురి : బాధ కలగదా మరి. నీవు హైదరాబాదు గురించి చెప్తూ ఉంటే నాకు కూడా చూడాలనిపిస్తోంది. ఎండాకాలం సెలవుల్లో మానాన్నగారిని నన్ను కూడా హైదరాబాదు తీసుకువెళ్లమని అడుగుతాను.

రాజు : అవును. తప్పకుండా హైదరాబాదు చూడవలసిన ప్రదేశమే !

## ఇవి చేయండి

అ. ఇచ్చిన జవాబులకు సరియైన ప్రశ్నలు రాయండి.

1. ........................................ ?
జ. రమణ ఊరి పేరు విజయవాడ.

2. ........................................ ?
జ. కమల మూడో తరగతి చదువుతున్నది.

3. ........................................ ?
జ. కరీం వయస్సు ఎనిమిది సంవత్సరాలు.

4. ........................................ ?
జ. పాఠశాలలో మేం కబడ్డీ ఆడుతాం.

5. ........................................ ?
జ. రామచంద్రాపురంలో ఆదివారం సంత జరుగుతుంది.



ఆ. మీ ఇంటికి కొత్తగా వచ్చిన వారికి మీ గ్రామం చుట్టు పక్కల ఏఏ విశేషాలు ఎందుకు చూపుతారో రాయండి :

1. ______________________________
2. ______________________________
3. ______________________________
4. ______________________________
5. ______________________________

ఇ. కింది పదాలలో సంబంధం లేనిదాన్ని సున్నాతో చుట్టండి :

1. ఆవు - పులి - సింహం - తోడేలు
2. ఎరుపు - తెలుపు - నలుపు - పులుపు
3. చెరువు - అడవి - సముద్రం - నది
4. గడియారం - కత్తి - తుపాకి - బాణం
5. నెమలి - చిలుక - నక్క - కొంగ





ఈ. నీవు హైదరాబాదు వెళ్ళితే ఏమేం చూస్తావు ?

1. ______________________________
2. ______________________________
3. ______________________________
4. ______________________________
5. ______________________________



ఉ. పాఠం చదవండి. అందులో ఉన్న నామవాచకాలు, సర్వనామాలు రాయండి :

| నామవాచకాలు | సర్వనామాలు |
| --- | --- |
| ................................ | ................................ |
| ................................ | ................................ |
| ................................ | ................................ |
| ................................ | ................................ |
| ................................ | ................................ |
| ................................ | ................................ |

ఊ. అంత్యాక్షరి : పదం చివరి అక్షరంతో మొదలయ్యే తరువాతి పదాన్ని ఎలుక తోకతో చుట్టుతూ వెళ్ళండి. కాని తోక ఎక్కడా గీచినదాని మీదుగా దాటకూడదు.



| | | |
| --- | --- | --- |
| హైదరాబాదు | తుపాకి | చార్మినారు |
| హుస్సేన్‌సాగర్ | లుంబినీ | రవీంద్రభారతి |
| కుర్చీ | దున్నపోతు | విగ్రహం |
| రుద్రమదేవి | తెలుగుతల్లి | నెమలి |

ఎ. కింది ఖాళీలను బ్రాకెట్లలోని పదాలలో సరైన దానితో నింపండి :

1. తోటలోని ............................ లో కప్పలు ఉన్నాయి. (బావి, భావి)
2. అతను చిత్ర ....................లో నేర్పరి. (కల, కళ)
3. నీటిపై ........................ లో ప్రయాణం చేస్తారు. (నవ, నావ)
4. శ్రీరాముడు...................... లేడిని వెంబడించాడు. (మాయ, మామ)
5. సహాయపడిన వారికి .................. చెప్పాలి. (కృతఘ్నత, కృతజ్ఞత)
6. మైదానంలో .................. మంది పిల్లలు ఆడుతున్నారు. (పంది, పది)



# 23. కృష్ణానది

బాలలూ! నేనెవరో మీకు తెలుసా ? మీరందరూ ఒకరిని గురించి ఒకరు చెప్పుకుంటారు. నాగురించి నేనే చెప్పుకుంటున్నాను. సరదాగా వింటారు కదూ !

నేను ఒక నదిని. నన్ను కృష్ణానది అంటారు. నేను మహారాష్ట్రలోని పడమటి కనుమలలో, మహాబలేశ్వరం వద్ద జన్మించాను. అక్కడి నుండి కర్ణాటక రాష్ట్రంలో ప్రవేశించాను. నాతో స్నేహం చేయాలని భీమానది, తుంగభద్రానది నన్ను కలిశాయి. వాటి స్నేహం నాకు ఎంతో ఆనందాన్ని కల్గించింది. స్నేహం చాల గొప్పది కదా !

నా ప్రయాణాన్ని కొనసాగిస్తూ మిమ్మల్ని పలకరిద్దామని ఇలా వచ్చాను. దారిలో కొన్ని పుణ్యక్షేత్రాలను చూశాను. కర్నూలు జిల్లాలో ఉన్న శ్రీశైలం తిలకించాను. మల్లికార్జునస్వామిని సేవించాను. గుంటూరు జిల్లాలోని అమరావతిని చూశాను. తర్వాత విజయవాడలోని కనకదుర్గమ్మను దర్శించాను.



శ్రీశైలంలోని మల్లికార్జునస్వామి దేవాలయం



నాగార్జునసాగర్





శ్రీశైలం ఆనకట్ట

నన్ను వదిలేస్తే నేను ఎటో వెళ్లిపోతానని నా నీటిని పంట పొలాలకు మళ్లించాలని అనుకొన్నారు. విజయవాడ వద్ద నాకు ఆనకట్ట కట్టారు. ఇప్పుడక్కడే ప్రకాశం బారేజి నిర్మించారు.

విజయపురి వద్ద ఆనకట్ట కట్టి, సముద్రంలాంటి జలాశయం ఏర్పరచారు. అదే నాగార్జునసాగర్. శ్రీశైలం వద్ద కూడా నాకు పెద్ద ఆనకట్ట కట్టారు. ఈ జలాశయాల నుండి విద్యుత్తు తయారు చేస్తున్నారు.

నా ఒడ్డునే కొండపల్లి ఉంది. ముట్టుకుంటే అందంగా నాట్యం చేసే కొయ్యబొమ్మలకు ఈ కొండపల్లి ప్రసిద్ధి. కూచిపూడి గ్రామం కూడ నా తీరానికి సమీపంలోనే ఉంది. ఈ ఊరు నాట్యకళకు ప్రసిద్ధి.

ఇలా పడమటి నుంచి బయలుదేరి తూర్పుగా ప్రవహిస్తూ హంసలదీవి దగ్గర సాగరంలో కలసిపోతున్నాను. ఈ సాగరం పేరు ఏమిటో తెలుసా ?

## ఇవి చేయండి

అ. కింద ఇచ్చిన పదాలను అర్థం చేసికొని వాటిని ఒక క్రమంలో రాయండి :

ఉదా : సముద్రం - సరస్సు - చెరువు - కుంట
కుంట - చెరువు - సరస్సు - సముద్రం

1. పండు - పిందె - పుష్పం - కాయ
2. ధాన్యం - పైరు - కోతలు - నారు
3. గంట - సెకండు - నిమిషం - దినం
4. అక్క - చెల్లెలు - అమ్మ - నానమ్మ
5. పెరుగు - వెన్న - పాలు - నెయ్యి

ఆ. పాఠం ఆధారంగా సరైన పదంతో వాక్యం రాయండి :

ఉదా: కడప జిల్లాలో శ్రీశైలం ఉన్నది.
కర్నూలు జిల్లాలో శ్రీశైలం ఉన్నది.

1. కొండపల్లి నాట్యానికి ప్రసిద్ధి.
______________________________
2. స్నేహం చేయాలని భీమానది, గోదావరినది నాతో కలిశాయి
______________________________
3. కృష్ణానది తూర్పుగా ప్రవహిస్తూ చెరువులో కలుస్తుంది.
______________________________
4. గుంటూరు జిల్లాలో ఉన్న కనకదుర్గను దర్శించాను.
______________________________
5. ఆంధ్రప్రదేశ్ రాజధాని ఢిల్లీ వెళ్ళాను.
______________________________

ఇ. కృష్ణానది తీరంలో ఉన్న ముఖ్యమైన ప్రదేశాల పట్టిక రాయండి :





ఈ. పాఠం చదవండి. వరుసక్రమంలో రాయండి :

కృష్ణానది
- శ్రీశైలం తిలకించింది
- కనకదుర్గను దర్శించింది.
- మహాబలేశ్వరంలో జన్మించింది.
- హంసలదీవి వద్ద సాగరంలో కలిసింది.
- కర్ణాటకలో ప్రవేశించింది.
- భీమానది, తుంగభద్రానదులతో కలిసింది.
- కూచిపూడి, కొండపల్లి మీదుగా సాగింది.
- మల్లికార్జున స్వామిని సేవించింది.

ఉ. మీకు దగ్గరలో ఉన్న నదిని గురించి జట్లలో చర్చించండి, ఐదు వాక్యాలు రాయండి.

ఊ. కృష్ణానది తన గురించి తాను చెప్పుకున్నదిగదా !
మీ గురించి మీరు రాయండి.

నా పేరు : ..................................
నేను ........................ ఊరిలో ఉంటాను.
మా అమ్మపేరు ..........................
మా నాన్నపేరు.......................
నేను.................తరగతి చదువుతున్నాను.
నా మిత్రులు ..............................
మేమంతా రోజూ ..........................
..................................................
..................................................
నేను ప్రతిరోజూ.............................
..................................................
..................................................





## 24. ఋతువులు

వసంతఋతువు వచ్చింది
వసుధకు అందం తెచ్చింది
పచ్చనిపచ్చని చిగుళ్లతో
పరవశాన్ని కలిగించింది.

గ్రీష్మఋతువు వచ్చింది
ఎండలు మెండుగ తెచ్చింది
మండే సూర్యుని జ్వాలలతో
మలమల జగతిని మాడ్చింది.

వర్షఋతువు వచ్చింది
వానలు వరదలు తెచ్చింది
ఊటల నీటిని నింపింది
ఉర్వికి ఊరట నిచ్చింది.

శరదృతువు వచ్చింది
చల్లని వెన్నెల నిచ్చింది
కార్తీకదీపం వెలిగింది
పుడమిన కాంతులు నింపింది.

హేమంతఋతువు వచ్చింది
హిమబిందువులను తెచ్చింది
ముత్యపు ముగ్గులు పరచింది
ముద్దూ మురిపెము గొలిపింది.

శిశిరఋతువు వచ్చింది
చెట్ల ఆకులను రాల్చింది
వనమున మోడుల నిలిపింది
వసంతలక్ష్మిని పిలిచింది.



## ఇవి చేయండి

అ. 1. ఈ గేయాన్ని లయబద్ధంగా పాడండి.
2. పాట పాడుతూ అభినయం చేయండి.
3. ఋతువుల పేర్లు క్రమంలో చెప్పండి, రాయండి.

ఆ. ఏయే ఋతువులు ఏయే నెలల్లో వస్తాయో, పట్టిక తయారు చేయండి.

ఇ. ఋతు ధర్మాలను మీ సొంత మాటల్లో చెప్పండి :



ఈ. ఆలోచించండి. జవాబు చెప్పండి. రాయండి :

- వసంత ఋతువు ఎందుకు అందంగా ఉంటుంది ?
- శరదృతువులో ఆకాశం ఎలా ఉంటుంది ?
- ఏ ఋతువు మీకిష్టం ? ఎందుకు ?
- వర్షాకాలంలో వానలు కురవకపోతే ఏమౌతుంది ?

ఉ. కింద కొన్ని పంక్తులున్నాయి.వాటిని చదవండి. వాటిలాగా అర్థాన్నిచ్చే పంక్తులను గేయంలో వెదకండి. రాయండి :

- ఊటలను నీటితో నింపింది. నేలకు ఊరట కలిగించింది.
- ఆకు పచ్చని చిగుళ్లతో ఆనందాన్ని ఇచ్చింది.

ఊ. జతపర్చండి. రాయండి.

| | |
|---|---|
| వసంత ఋతువులో | వానలు కురుస్తాయి |
| వర్షఋతువులో | ఎండలు ఎక్కువ |
| గ్రీష్మ ఋతువులో | చలి ఎక్కువ |
| శరదృతువులో | చల్లని వెన్నెల |
| హేమంత ఋతువులో | చెట్లు ఆకులు రాలుతాయి |
| శిశిర ఋతువులో | చెట్లు చిగురిస్తాయి |

ఉదా : వసంత ఋతువులో చెట్లు చిగురిస్తాయి.

ఎ. - భూమి అని అర్థాన్నిచ్చే పదాలు పాఠంలో గుర్తించి, రాయండి.



ఏ. కింది పదాల్లో నుంచి సరియైన దాన్ని ఎన్నుకొని రాయండి.

- వసుద, వసుధ, వశుధ, వసుధ [ ]
- గ్రిష్మరుతువు, గ్రీష్మఋతువు, గ్రీష్మఋతువు, గ్రీస్మరుతువు [ ]
- శరద్రుతువు, శరదృతువు, షరదృతువు, పరదృతువు [ ]

ఐ. పూరించండి :



ఎండాకాలం వచ్చింది
ఎండలు మెండుగ తెచ్చింది
..........................................

వర్షాకాలం ..........................
..........................................
..........................................

శీతాకాలం ..........................
..........................................
..........................................

ఏ కాలం అంటే నీకు ఇష్టం ? ఎందువల్ల ?

## 25. ఆణిముత్యాలు

1. దేశసేవ కంటె దేవతార్చన లేదు
స్వార్థపరత కంటె చావు లేదు
సానుభూతి కంటె స్వర్గంబు లేదురా !
లలిత సుగుణ జాల తెలుగుబాల !!

భావము : తెలుగుబాలా! దేశసేవకు మించిన దైవపూజ లేదు.
స్వార్థపరత కంటె చావుమేలు. దయకు మించిన స్వర్గం లేదు.



2. కష్టపెట్టబోకు కన్నతల్లి మనసు
నష్టపెట్టబోకు నాన్న పనులు
తల్లిదండ్రులన్న దైవసన్నిభులురా !
లలిత సుగుణజాల తెలుగుబాల !!

భావము : తెలుగుబాలా! తల్లి మనసుకు కష్టం కలిగించవద్దు.
నాన్న పనులకు నష్టం కలిగించవద్దు. తల్లిదండ్రులు
దైవంతో సమానం.

3. పరగ రాతిగుండు పగులగొట్టగ వచ్చు
కొండలన్ని పిండిగొట్ట వచ్చు
కఠినచిత్తు మనసు కరగింపగారాదు
విశ్వదాభిరామ వినురవేమ !

భావము : బండరాయిని పగుల గొట్టవచ్చు. కొండలను కూడా పిండిగా చేయవచ్చు.
కాని దయలేని వాని మనస్సును కరిగించలేము.





4. కులములోన నొకడు గుణవంతుడుండిన
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ !

భావము : గంధపుచెట్టు సువాసన అడవి అంతా వ్యాపిస్తుంది.
అట్లాగే వంశంలో ఒక్క గుణవంతుడుంటే వంశానికి మంచి పేరు వస్తుంది.

5. ఏరకుమీ కసుగాయలు
దూరకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పారకుమీ రణమందున
మీరకుమీ గురువునాజ్ఞ మేదిని సుమతీ!

భావము : లేత కాయలను ఏరవద్దు. చుట్టాలను తిట్టటం తప్పు.
యుద్ధంలో వెన్ను చూపవద్దు. గురువు ఆజ్ఞను
మీరవద్దు.

6. తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
తనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

భావము : కోపం మనకు శత్రువు. శాంతం మనల్ని కాపాడుతుంది.
దయ చుట్టం లాగా సహాయం చేస్తుంది. సంతోషం సుఖాన్ని,
దుఃఖం కష్టాన్ని కలిగిస్తుంది.



## అకారాది క్రమంలో
## పదాలు - అర్థాలు

**అ**

అభివృద్ధి = పెంపు
అద్భుతం = వింత
అర్చన = పూజ
అవధి = హద్దు

**ఆ**

ఆచారం = నడత
ఆది = మొదలు
ఆస్థానం = కొలువు

**ఉ**

ఉద్యమం = పోరాటం
ఉదుటున = ఒక్కసారిగా
ఉపన్యాసం = ఏదైన ఒక విషయాన్ని వివరంగా చెప్పడం
ఉపవాసం = ఏమి తినకుండా ఉండడం
ఉర్వి = భూమి
ఉల్లాసం = సంతోషం

**ఎ**

ఎద = గుండె
ఎల్లరు = అందరు

**ఒ**

ఒర్చుకొను = సహించు

**క**

కనుమ = కొండల మధ్య తోవ
కపటం = మోసం
కపోతం = పావురం
కలకాలం = ఎల్లప్పుడు
కల్ల = అబద్ధం
కలివిడి = కలుపుగోలుతనం
కసుకాయలు = పచ్చికాయలు
కాంచుట = చూచుట
కాంతి = వెలుగు
కార్మికుడు = కష్టించి పనిచేసేవాడు

కృతజ్ఞత = చేసిన మేలు గుర్తుంచుకోవడం
కృత్యం = పని

**గ**

గమనించు = చూచు
గుబులు = దిగులు
గ్రీష్మం = ఎండ

**చ**

చిత్రం = బొమ్మ
చెరసాల = జైలు

**జ**

జగతి = ప్రపంచం
జన్మించు = పుట్టు
జలాశయం = పెద్దచెరువు
జ్వాల = మంట

**త**

తాకట్టుపెట్టు = కుదువపెట్టు
తార = నక్షత్రం
తిలకించు = చూచు
తీరం = ఒడ్డు
తెగువ = సాహసం
తేరు = రథం
తొలి = మొదటి
తోట = వనం

**ద**

దండోరా = చాటించు
దర్శించు = చూచు
దీపశిఖ = దీపపుమంట
దురాశ = చెడు కోరిక
దూరుట = తిట్టుట
దోషం = తప్పు
దోషి = నేరము చేసినవాడు



**న**

నింగి = ఆకాశం
నిధి = పోగుచేసిన డబ్బు
నిలయం = ఉండుచోటు
నీరసించుట = బలహీనపడుట
నేత = నాయకుడు
నేర్పు = నైపుణ్యం
నేస్తం = స్నేహితుడు

**ప**

పయనించు = ప్రయాణించు
పరవశించు = మైమరచు
పర్వదినం = పండుగ రోజు
పసిడి = బంగారం
పారుట = పారిపోవుట
పిసినారి = లోభి; డబ్బు ఖర్చుపెట్టుటకు బాధపడేవాడు
పురాతనము = చాలా కాలం కిందట
ప్రత్యక్షం = ఎదురుగా కన్పించు
ప్రదర్శన = విశదపరిచి చూపుట

**బ**

బహుమానం = కానుక
బాదుట = కొట్టుట

**భ**

భటుడు = సేవకుడు
భద్రపరచు = జాగ్రత్తపరచు
భేదము = తేడా

**మ**

మందలించు = కోపగించు
మది = మనస్సు
మమత = ప్రేమ
మలయజం = గంధపు చెట్టు
మహిళ = స్త్రీ
మాటువేయు = కాపుగాయు
మార్గం = తోవ
మూగుట = ఒక చోట చేరుట
మేదిని = భూమి

**ర**

రణము = యుద్ధం
రక్షించు = కాపాడు
రీతి = విధం

**వ**

వదనం = ముఖం
వనం = తోట, అడవి
వసుధ = భూమి
విలపించు = ఏడ్చు
వివాహం = పెండ్లి
విశ్వం = ప్రపంచం
విశ్వాసం = నమ్మకం
విశేషాలు = సంగతులు
వృద్ధాప్యం = ముసలితనం
వైద్యశాల = ఆసుపత్రి, దవాఖానా

**శ**

శత్రువు = పగవాడు

**స**

సత్యం = నిజం
సమత = సమానం
సమరం = యుద్ధం
సహకారం = తోడ్పాటు
సహనం = ఓర్పు
సాగరం = సముద్రం
సునాయాసంగా = తేలికగా
సుమతి = మంచి బుద్ధిగలవాడు
సొంపు = అందం
సౌజన్యం = మంచితనం
సంఘసేవ = ప్రజలకు సేవచేయుట
సంతసం = ఆనందం
సందేహం = అనుమానం

**హ**

హరివిల్లు = ఇంద్రధనుస్సు
హిమం = మంచు
హృది = మనస్సు
హెచ్చు = ఎక్కువ

# ఉపాధ్యాయులకు సూచనలు

- పిల్లలు తరగతిలో ఎక్కువగా మాట్లాడడానికి అవకాశం కల్పించాలి.
- గేయాలను అభినయంతో బృందగానం చేయించాలి.
- ప్రతి పాఠం చివర కొన్ని కృత్యాలు ఉన్నాయి. వాటిని పిల్లలు చేసేటట్లు చూడాలి. ఈ కృత్యాల ద్వారా ఆసక్తి పెరిగి పాఠంలోవున్న విషయంపై పూర్తి అవగాహన ఏర్పడుతుంది. భాషపై అధికారం కలుగుతుంది. వీటివల్ల విద్యార్థి పాఠంలోని ప్రశ్నలకు స్వంతంగా జవాబులు రాయగలడు. ఒక ప్రశ్నకు పిల్లల నుంచి ఒకేరకమైన సమాధానాలు ఆశించవద్దు. వారు చెప్పే/ రాసే జవాబులను ప్రోత్సహించండి. భాష సరిచేయండి.
- తరువాత ఏమవుతుంది ?

  నువ్వేమనుకుంటున్నావు ?

  నువ్వే ఆ స్థానంలో ఉంటే ఏం చేస్తావు ?

  కథను పూర్తిచేయండి మొ॥ వాటి ద్వారా పిల్లలలో భావవ్యక్తీకరణ, సృజనాత్మకత పెరగడానికి అవకాశం లభిస్తుంది. కాబట్టి ఇలాంటి వాటిని పిల్లలచే ఎక్కువగా చేయించాలి.
- విద్యార్థులు తమంతట తాము చదువుకుని చేయగలిగేట్లుగా కృత్యాలు ఉన్నాయి. జట్లు చేయడంలోను, మిగతాసమయాల్లోను అవసరమైన చోట తగిన సహాయం చెయ్యాలి.
- కథలను పూరించడం, చిత్రపట సంభాషణ మొ॥న కృత్యాలు చేసేటప్పుడు పిల్లల స్వంత ఆలోచనకు ప్రాధాన్యత ఇవ్వాలి.
- ఒక పాఠం కింద ఇవ్వబడిన కృత్యాలను మిగతా పాఠాలకు కూడ అన్వయించుకొని పిల్లలచే చేయించాలి.
- పదాలకు అర్థాలు పుస్తకం చివర ఉన్నాయి. అవసరమైన చోట వాక్యప్రయోగం ద్వారా సన్నివేశాల ద్వారా, బొమ్మల ద్వారా అర్థాలు తెలుసుకొనేటట్లు చేయాలి.
- 'ఆణి ముత్యాలు' (పద్యాలు) చివరి పాఠంగా ఇచ్చాం. అయితే వీటన్నిటిని ఆఖరినెలలో అన్ని పద్యాలు చెప్పకుండా ప్రతి మూడు మాసాలకు రెండు పద్యాల చొప్పున కంఠస్థం చేయించి, భావం చెప్పాలి. చెప్పించాలి.
- ఉపాధ్యాయులు విద్యార్థుల భాషాకౌశలాలను అభివృద్ధి చెయ్యాలి. వినడం, మాట్లాడడం, చదవడం, రాయడం వంటి నైపుణ్యాలు బాగా అభివృద్ధికావాలి. అందుకే తగిన కృత్యాలు చక్కగా నిర్వహించాలి.